Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 81 • సంచిక: 18 • 30-4-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



## బలిపీఠమెక్కుతున్న డిఎస్!

నిజామాబాద్ శాసనసభ ఉపఎన్నికలో పోటీ చేయక తప్పని పరిస్థితి ఏర్పడడం పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్‌కు బలిపీఠం ఎక్కినట్లుగా వుంది. శాసనసమండలి టిక్కెట్ కోసం తీవ్ర ప్రయత్నం చేశారాయన. కానీ ఏ కారణం వల్లనో అధిష్టానం కరుణ చూపలేదు. దానితో ఉప ఎన్నిక తప్ప వేరే మార్గం లేకుండా పోయింది. అయితే అది చాలా ప్రమాదకర ప్రయోగం. మొన్నటి ఎన్నికలలో ఇక్కడ నుంచి ఓడిపోయాడు. అప్పటికి ఇప్పటికి కాంగ్రెస్ పరిస్థితి పెద్దగా మెరుగు పడింది లేదు. తెలంగాణ ఉద్యమం కోసం ఎమ్మెల్యే పదవులు త్యాగం చేసినవారి పట్ల ప్రజలలో ఎంతో కొంత సానుకూలత వుండడం సహజం. పైగా నిజామాబాద్‌లో తెలంగాణ కోరిక ఎక్కువ. కాంగ్రెస్ పార్టీలోని ఒక వర్గం అసలు ఈ ఎన్నికలలో అభ్యర్థులను నిలబెట్ట కూడదని వాదిస్తున్నది. తెలంగాణ కోసం త్యాగం చేసిన వారికి అడ్డంపోతే, తెలంగాణ ద్రోహులుగా మిగిలి పోతామని భయపెడుతున్నారు కె.కేశవరావు వంటి సీనియర్లు. ఆదిలాబాద్ జిల్లా నుంచి పోటీకి దిగాలని భావించిన ఇంద్రకరణ్ రెడ్డికి నేరుగా ఫోన్ చేసి, హెచ్చరిక చేశాడు కెకె. ఆ పరిస్థితులలో డిఎస్‌కు మాత్రం కాంగ్రెస్ నుంచి ఎంత మాత్రం సహకారం లభిస్తుందన్నది ప్రశ్న. ఈ

కొరవ 14వ పేజీలో

# రెండింటికీ చెడుతున్న రోశయ్య!

అందరికీ మంచిగా వుండాలన్న తాపత్రయంలో ఎవరికీ కొరగాని వాడిగా మిగిలి పోతున్నాడు ముఖ్యమంత్రి కె.రోశయ్య. ఆయన పని తీరును దగ్గరనుంచి పరిశీలిస్తున్న వారి నిశ్చిత అభిప్రాయం ఇది. మంత్రి వర్గ విస్తరణలో ఆయన వైఫల్యం ఇందుకొక ఉదాహరణ.

తన తండ్రి నుంచి తనకు వారసత్వంగా దక్కవలసిన ముఖ్యమంత్రి పీఠాన్ని రోశయ్య దురాక్రమించాడన్న అక్కసుతో వైఎస్.జగన్ మొదటిరోజు నుంచీ ఆయన్ను ఇబ్బంది పెడుతూనే వున్నాడు. ముప్పాతిక భాగం మంత్రులు జగన్‌ను సంతృప్తిపరచడం కోసం, ముఖ్యమంత్రి అన్న మర్యాద కూడా లేకుండా ఇష్టానుసారం వ్యవహరిస్తున్నారు. క్యాబినెట్ సమావేశాలలో సైతం నోరు పారేసుకొంటున్నారు. అమర్యాదగా ప్రవర్తిస్తున్నారు. దీన్ని చక్కదిద్దాలంటే తమ పరిధి దాటి నడుస్తున్న మంత్రుల తోక కత్తిరించడ మొక్కటే మార్గం. కానీ ఆరునెలల నుంచి ముఖ్యమంత్రి ఆ పని చేయలేక పోతున్నారు. అట్లని, వారితో సర్దుక పోవడానికి ఆయన సిద్ధంగా వున్నాడా అంటే, అదీ లేదు. వీలైనప్పుడల్లా అటు జగన్ మీద, ఇటు ఈ కోవకు చెందిన మంత్రుల మీద తన అసహనాన్ని బాహాటంగానే వ్యక్తం చేస్తున్నాడు. అలుగుతున్నాడు. ఆగ్రహిస్తున్నాడు. మొదట మొదట ముఖ్యమంత్రి కోపం చూసి ఈ వర్గం మంత్రులలో కొంత భయం కనిపించేది. కానీ రోజులు గడిచే కొద్దీ ఆ చలి తీరిపోతున్నది. మాటలలో కోపగించుకోవడం తప్ప చేతలలో ఏమీ చేయలేడన్న చులకన భావం ఏర్పడుతున్నది వారిలో.

మరొకప్రక్క రోశయ్య పుణ్యాన అణగారి పోతున్న తమ రాజకీయ జీవితాలు వెలుగులోకి వస్తాయన్న ఆశతో ఆయన్ను ఆశ్రయించిన వారికీ నిరాశే మిగులుతున్నది. అపారమైన రాజకీయ అనుభవం, అపూర్వమైన అధిష్టానం అండదండలు కల్గిన ముఖ్యమంత్రి, ఎవరిని ఎక్కడ వుంచాలో అక్కడ పెడతారని వీరు వేసుకొన్న అంచనాలు తారుమారై పోయాయి. తన మాట వినని కొందరు మంత్రులను పీకి పారేసి, తన మనుషులనుకొన్న వారిని మంత్రివర్గంలోకి తీసుకొంటే తప్ప ముఖ్యమంత్రి రోశయ్య తన అధికారాన్ని సక్రమంగా నిర్వహించలేడన్నది




వీరి భావన. మొదట మొదట రోశయ్య కూడా వీరితో ఏకీభవించినట్లు కన్పించాడు. దానితో తమకు పదవులు దక్కుతాయన్న ఆశ కల్గింది. కానీ రోజులు గడిచిపోవడం తప్ప ఏమీ జరగడం లేదు. ఏ మార్పూ లేదు. దానితో అటు జగన్ మెహర్బానీ కోసం ముఖ్యమంత్రిని వీలైనప్పుడల్లా అవమానించి ఆనందపడే మంత్రుల ఆటలు అట్లనే సాగుతున్నాయి. ఇటు రోశయ్యకు దగ్గర కావాలనుకొన్నవారు నిరాశతో మెల్లమెల్లగా ఆయనకు దూరమై పోతున్నారు. రెండింటికీ చెడ్డ రేవడిగా మిగిలి పోతున్నాడు ముఖ్యమంత్రి. ఆయన పదవి దాదాపుగా అలంకారప్రాయం అవుతున్నది.

రోశయ్య ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకా

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




అలా అన్నప్పట్నుంచీ ఏ పనీ చేయట్లేదు బావా!
జెండాలు మోయడం తప్ప..!!

# సరైన నిర్ణయం

రాష్ట్రంలోని ట్రిపుల్ ఐటి కాలేజీలలో సీట్ల సంఖ్యను సగానికి తగ్గించాలని ముఖ్యమంత్రి రోశయ్య తీసుకొన్న నిర్ణయం వైఎస్ అభిమానుల ఆగ్రహానికి గురి చేస్తున్నది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ప్రారంభించిన సవాలక్ష పథకాలలో ట్రిపుల్ ఐటి సంస్థల స్థాపన ఒకటి. కేంద్ర ప్రభుత్వం నిర్వహించే ఐఐటిలతో సమానంగా, రాష్ట్ర స్థాయిలో అత్యున్నత విద్యాలయాలను నెలకొల్పాలన్నది వైఎస్ ఆశయం. కేంద్ర ఐఐటిలలో ప్రవేశం చాలా కష్టం. జాతీయస్థాయిలో జరిగే ప్రవేశ పరీక్షలలో రాష్ట్ర విద్యార్థులు అతి తక్కువసంఖ్యలో ఎంపికవుతున్నారు. అత్యంత ప్రతిభావంతులకు మాత్రమే అవకాశం లభిస్తున్నది. ఐఐటిలో చదువు పూర్తి చేసుకొన్న వారికి జీవితం వడ్డించిన విస్తరి వంటిది. ఆ సంస్థల నుంచి వచ్చే విద్యార్థులను అంతర్జాతీయ స్థాయి బహుళజాతి సంస్థలు కళ్లకద్దుకొని, కోరిన జీతమిచ్చి ఉద్యోగాలిస్తున్నాయి. అమెరికా, ఇంగ్లండ్ వంటి దూర దేశాలలో కూడా ఐఐటిలో చదివిన భారతీయ యువతీ యువకులు అద్భుత స్థాయిలో రాణింపుకు వస్తున్నారు. దానితో ఐఐటిలో ప్రవేశం ప్రతి కన్న తల్లి, తండ్రికీ ఒక కలగా మారుతున్నది. అందుకోసం తమ పిల్లలను ఆరేడు తరగతుల నుంచే ఒత్తిడి చేస్తున్నారు. స్పెషల్ కోచింగ్ పేరుతో రాచి రంపాన పెడుతున్నారు. ఈ మోజును సొమ్ము చేసుకొంటున్నాయి కోచింగ్ సెంటర్లు. ఐఐటి క్యాంపస్ పేరిట ప్రత్యేక కళాశాలలు నెలకొల్పి లక్షలలో ఫీజులు గుంజుతున్నాయి. అంత ఖర్చుపెట్టి, తమ పిల్లలను పసితనం నుంచే నిద్రాహారాలు లేకుండా చేయించినా ఐఐటిలో సీటు దొరకక నిరాశపడుతున్నారు. జీవిత కాలం ఆ అసంతృప్తి వారి మనసులలో మిగిలిపోతున్నది.

ప్రతిభ వుండి కూడా, జాతీయ స్థాయిలో పోటీ ఫలితంగా రాణింపుకు రాలేకపోతున్న పిల్లలకు, ఐఐటి స్థాయిలో చదువు చెప్పించడమే ఈ ట్రిపుల్ ఐఐటి విద్యా సంస్థల లక్ష్యం.

ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణ మూడు ప్రాంతాలలో మూడు సంస్థలను నెలకొల్పారు. వాటి రూపకల్పనకు భారీ ప్రణాళిక రచించారు. ఐఐటి స్థాయి విద్య అంటే, ఆషామాషీ వ్యవహారం కాదు. అందుకు ఎంతో విస్తృతమైన వసతులు కావాలి. భవనాలు, ఖరీదైన పరికరాలతో లాబొరేటరీలు, లైబ్రరీలు, అన్నిటికీ మించి ప్రతిభావంతులు, అంకిత భావం కల్గిన అధ్యాపకులు కావాలి. కోట్లు క్రుమ్మరిస్తే తప్ప అది జరగదు. కానీ రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడు తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్నది. ప్రభుత్వ ఉద్యోగాలకు నెలనెలా జీతాలు ఇవ్వడానికే ఖజానాలో పైసలు లేక తడుముకొంటున్నది. ట్రిపుల్ ఐటిల నిర్మాణానికి, నిర్వహణకు నిధులు ఇచ్చే పరిస్థితి లేదు. దానితో తలపెట్టిన భవనాలు సగంలోనే నిలిచిపోయి వున్నాయి. ఇతర వసతులు కూడా సరిగా లేవు. చాలీ చాలని నిధులతో, అరాకొరా వసతులతో ఇటువంటి ప్రతిష్టాత్మకమైన విద్యాసంస్థలను నిర్వీర్యం చేసే కంటే, విద్యార్థుల సంఖ్యను తగ్గించి, నిధులున్న వరకే సంస్థలను నిర్వహించాలని నిర్ణయం తీసుకొన్నారు ముఖ్యమంత్రి రోశయ్య. మంచం వున్నంత వరకే కాళ్లు చాపుకోవాలని పెద్దలు చెప్పిన సూత్రాన్ని పాటించారాయన.

అయితే రాజశేఖర్‌రెడ్డి అభిమానులను ఇది బాధ పెడుతున్నది. వైఎస్ కార్యక్రమాలను ఒకటొకటిగా నీరుగార్చి వేస్తున్నారన్నది వారి ఆవేదన. వైఎస్ మొదలు పెట్టాడు కాబట్టి కొనసాగించి తీరాలన్న మొండి పట్టుదల తప్ప వారి ఆవేదనలో సహేతుకత లేదు. రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక సంక్షోభం రాజశేఖర్‌రెడ్డి బ్రతికి వున్నప్పుడే ఏర్పడిందన్న నిజం మరిచిపోకూడదు. ఇప్పుడు ఆయన బ్రతికి వున్నా రోశయ్య తీసుకొన్న నిర్ణయాల వలెనే వుండి వుంటాయన్న వాస్తవిక ఆలోచన అవసరం. ట్రిపుల్ ఐటిల స్థాపన ఉద్దేశం, ఐఐటి స్థాయి విద్యాబోధన. అందుకు తగినవసతులు లేకుండా చదువు చెప్తే, వాటిలో చదివిన విద్యార్థులు ఎందుకూ పనికి రాకుండా పోతారు. ఆ సంస్థల విలువ క్షీణించి పోతుంది. తక్కువమందికి బోధన చేసినా, ఉత్తమ విద్య అందించగలిగితే వైఎస్ లక్ష్యం నెరవేరుతుంది తప్ప, ఆయన మొదలు పెట్టిన కార్యక్రమాలు ఏవీ ఆగకూడదన్న మొండితనంతో వ్యవహరిస్తే ఆయన లక్ష్యాన్ని నీరుగార్చిన వారౌతారు. ఆర్థిక కష్టాలలో రోశయ్య తీసుకొన్నది చాలా మంచి నిర్ణయం. ఆయన స్థానంలో వైఎస్ వున్నా అదే పని చేసి వుండేవాడు.

జమీన్‌రైతు

## జనవాణి

### ఏమిటి ఈ అన్యాయం?

రాష్ట్రంలోని విద్యావంతులు తమ జీవితాలపై ఎన్నో ఆశలు పెట్టుకొని ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షకు హాజరవుతుంటారు. ప్రతిభ ఆధారంగా మంచి వుద్యోగం వస్తుందని నిద్రాహారాలుమాని కష్టపడి చదువుతారు. కాని పరీక్షల్లో అత్యధిక మార్కులు సాధించిన వారికి ఇంటర్వ్యూలలో తక్కువ మార్కులు వేసి వారికి రావాల్సిన వుద్యోగాలు రాకుండా చేయడం దారుణం. ఈ వివక్ష విడనాడాలి. ప్రతిభ కనపరచిన వారికి తగిన న్యాయం చేయాలి. నిష్పక్షపాతంగా వ్యవహరించే వారి చేతనే ప్రభుత్వం ఇంటర్వ్యూలను జరిపిస్తే బాగుంటుంది.

ఎం.శ్యామల, కావలి

### బాగా పనిచేస్తున్నారు!

జిల్లా ఎస్పీగా ఈతముక్కల దామోదర్ పదవీ బాధ్యతలు చేపట్టాక శాంతిభద్రతలు, పౌరరక్షణ, సిబ్బంది సంక్షేమం, ట్రాఫిక్ సమస్యలపై రాజకీయ వత్తిడులకు అతీతంగా మెరుగుపరిచేందుకు చర్యలు చేపట్టడం హర్షదాయకం. నగరంలో ట్రాఫిక్ సమస్యకు ప్రతిబంధకంగా గాంధీబొమ్మ వద్ద వుండిన టాక్సీస్టాండును వేరొక చోటికి తరలించడంలో విజయం సాధించారు. అదేవిధంగా పగటిపూట పట్టణంలో లారీల నిషేధాన్ని విధించి ఈ విషయమై లారీ యజమానులను ఒప్పించారు. పట్టణంలో అధికశాతం ప్రమాదాలకు కారకులు అదుపులేని ఆటో సర్వీసులు. సెవన్ సీటర్ ఆటో, బస్సు సర్వీసులను పట్టణంలోకి రాకుండా చేయాలనుకొంటే నేతలు అడ్డుకోవడం శోచనీయం. కూరగాయల మార్కెట్‌లో వ్యాపారులను అదుపుచేసే బాధ్యతను సైతం ఎస్పీగారు తీసుకొంటే బాగుంటుంది.

సిహెచ్.హనుమంతరావు, నెల్లూరు

### విద్యుత్ వాడకాన్ని తగ్గించాలి!

పదేళ్ల ముందు విద్యుత్ సంక్షోభం లేదు. ప్రస్తుతం పలు ప్రాజెక్టులు, పారిశ్రామికవాడల నిర్మాణం మూలంగా విద్యుత్‌కు విపరీత గిరాకీ ఏర్పడింది. గతంలో ఇళ్లలో బట్టలు ఉతకడం, మసాలాలు నూరుడుబండ మీద నూరుకొనే వారు. ప్రస్తుతం కూర సైతం ఓవెన్‌లలో వేడి చేసుకొంటుంటారు. ఇళ్లలో అనవసర విద్యుత్ వాడకం అధిక మయ్యింది. ప్రభుత్వ కార్యాలయాల్లోని సీట్లలో వుద్యోగులు లేకపోయినా లైట్లు, ఫ్యాన్లు తిరుగుతునే వుంటున్నాయి. ఎవరికి వారు స్వచ్ఛందంగా విద్యుత్‌ను ఆదా చేస్తే తప్ప ఈ సమస్య పరిష్కారం కాదు.

సిహెచ్.సురేష్‌బాబు, నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

3-5-1940
పేజీలు : 16 వెల: అణా

### మందసా కాల్పులు

మందసా జమీందారీలో గత నెల 1వ తేది జరిగిన కాల్పుల గుర్చిన్నీ తదనంతరము జరిగిన పోలీసుల భీభత్స కార్యముల గుర్చిన్నీ ఒకదాని వెంట వొక రిపోర్టు అనేకములుగా వస్తున్నవి. ఇప్పటి దురంతమును విచారించుటకై ప్రభుత్వము అనధికారులతో కూడుకొనిన ఉపసంఘమును నియమించినచో ఎంతో బాగుండేది. ప్రభుత్వం ఇంతవరకూ ఆ మాట అనుకోలేదు. ఆంధ్ర రాష్ట్ర రైతుసంఘము వారును ఇచ్చట స్థితిగతులు విచారించుటకై చెరొక వుపసంఘమును నియమించారు. వీరు వెంటనే విచారణకు పూనాలి. మద్రాసు శాసనసభ్యులు, కార్మిక నాయకులగు కరుణాకర సుబ్బారావు, గౌతు లచ్చన్నగార్ల ప్రకటనల వలననే మనకు కాల్పుల పూర్వాపర సందర్భాలు, అచ్చట రైతులకు జరుగుచున్న అన్యాయాలు బాగా తెలియుచున్నవి. త్వరలోనే ఇచ్చట ప్రజలకు భీతి పోవునట్లును, నష్టపడిన కుటుంబములకు పరిహారము వచ్చునట్లును, చూడవల్సిన బాధ్యత రాష్ట్రీయప్రభుత్వము పైనున్నది. గాన తగినచర్య తీసుకొనవలెనని గోర్తాము.

### వడగండ్ల వాన

గత 26తేది సాయంత్రం నెల్లూరులో వడగండ్ల వాన, మంచి గాలికొట్టినది. చాలా చెట్లు కొమ్మలు విరిగినవి. 2వకారు పైరు బిర్రుపొట్టతో వున్నది నష్టపడింది. గడ్డం వెంకట్రామరెడ్డిగారి అరటితోట సర్వనాశనమైనది. 2వేలు నష్టం. కొన్ని ఇండ్లమీద పెంకులు కూడా ఎగిరినవి. రోడ్డంతా వడగండ్లతో నిండిపోయింది.

### మేడే ఉత్సవం

మే దినోత్సవం 1తేది నెల్లూరు టవున్‌లో జరిగింది. సాయంత్రం సభకు అధ్యక్షుడు కామ్రేడ్ నరసింహం, బాలసుబ్రహ్మణ్యంగారలు మాట్లాడారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

29-4-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు జిల్లా కాంగ్రెస్ మేళా!

నెల్లూరు జిల్లా కాంగ్రెస్ సంఘం 24తేది వసంతోత్సవం – కాదు మేళా– జరుపుకొన్నది. జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆహ్వాన సంఘాధ్యక్షుడు అయిన ఆనం సంజీవరెడ్డి ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన, నేత్రపర్వమైన, హృదయాహ్లాదకరమైన ఏర్పాట్లు జరిగినవి. ఈ స్వాగత సత్కారాలకు తాము అమందానంద కందళిత హృదయార విందులమైపోయామన్నారు ముఖ్యమంత్రి సంజీవయ్య. దానినిబట్టే ఏర్పాట్ల బాహుళ్యతను గమనించవచ్చు. ప్రతినిధుల సభకు, బహిరంగసభకు గూడా రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు నూకల నరోత్తమరెడ్డిగారు అధ్యక్షత వహించారు. ప్రతినిధుల సభలో ముఖ్యమంత్రి సంజీవయ్య, మంత్రులు సత్యనారాయణరాజు, సుబ్బారెడ్డిగారలు వుపన్యసించారు. అనేక విషయాల మీద చర్చలు జరిగినవి. నెల్లూరు జిల్లా అవసరాలకు సంబంధించి అనేక తీర్మానాలు గావించబడినవి.

24తేది రాత్రి బహిరంగసభ గూడా జయప్రదంగా జరిగింది. పదిహేను వేల మందికి పైగా ప్రజలు పాల్గొన్నారు.

### అల్లూరు ప్రాంతంలో రెండవకారు తనిఖీ

రైతుల ఆందోళన వల్ల పి.డబ్ల్యూ.డి అధికార్లు మోపూరు, ఇందుపూరు, పురిణి, అల్లూరు వగైరా గ్రామాల భూముల తనిఖీ చేసినారు. రైతులు వెంబడి వుండి పొరుదల గాని భూములను చూపించినారు. ఇందుపూరులో నేను మరొక 40మంది రైతులం పోయి అన్ని వివరాలు అధికార్లకు విన్నవించినాము.

ఈ దఫా నీటిసరఫరా విషయంలో పొరపాటు జరిగిందని విచారం వెలిబుస్తూ యికమీదట జరుగనివ్వమని, అప్పుడప్పుడు వచ్చి తనిఖీ జేసి, పొరుదల కాని భూములకు నీరు ఇస్తామని వాగ్దానం చేశారు. అధికార్లు స్వయంగా వచ్చి, పరిస్థితులు పరిశీలించి రైతులతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకొన్నందుకు రైతులు ఎంతో సంతోషపడుతున్నారు.

–ఏలూరు దశరథరామిరెడ్డి

# నెల్లూరు ముచ్చట్లు

## బంద్ పాక్షికం

నిత్యావసర వస్తువులు, పెట్రోల్, డీజిల్ ధరల పెరుగుదలకు నిరసనగా తెలుగుదేశం, వామపక్షాలు కలసి 27వ తేదీ నెల్లూరులో నిర్వహించిన బంద్‌కు పాక్షిక స్పందన లభించింది. ఎండలకు తోడు, పోలీసులు బంద్ నిర్వహిస్తున్న వివిధ పార్టీల నాయకులు, కార్యకర్తలను అరెస్ట్ చేయడంతో బంద్‌ను పర్యవేక్షించే వారు కరువవ్వడంతో మధ్యాహ్నం 12 గంటల తర్వాత వాహనాలు ఎటువంటి ఇబ్బందులు లేకుండా రోడ్ల మీద తిరిగాయి. బంద్‌ను తెలుగుదేశం నేతలు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, తాళ్లపాక రమేష్‌రెడ్డి, సిపిఎం నేతలు భానురాజు, మోహనరావు, సిపిఐ నేతలు పముజుల దశరథరామయ్య, రామరాజు పర్యవేక్షించారు. తమను అకారణంగా అరెస్ట్ చేసిన పట్టణ సిఐ వీరాంజనేయరెడ్డిపై సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఆగ్రహం వ్యక్తం చేశారు.

## కరంటాఫీసు సెంటర్‌లో హత్య

నెల్లూరు నగరంలో ఎప్పుడూ జన సామర్థ్యం వుండే సెంటర్లలో ఒకటైన కరంటాఫీసు సెంటర్‌లో 25వ తేది మిట్ట మధ్యాహ్నం శ్రీకాంత్ అనే రౌడీ షీటర్‌ను అతని ప్రత్యర్థులు నరికి చంపారు. ఇందుకూరు పేటకు చెందిన శ్రీకాంత్, భక్తవత్సలనగర్ వైన్‌షాపు యజమాని హత్యకేసుతోపాటు పలు కేసుల్లో నిందితుడు. వహాబ్‌పేటకు చెందిన సురేష్‌తో ఇతనికి మనస్పర్థలు న్నాయి. దీంతో కోటమిట్టకు చెందిన శ్రీనివాసులు, నిప్పోసెంటర్‌కు చెందిన హరితో కలసి శ్రీకాంత్‌ను హతమార్చి నట్లు పోలీసు కథనం. నగర డిఎస్పీ రాధిక ఇంటికి కూతవేట దూరంలో ఈ హత్య జరగడంతో పోలీసులు ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని నిందితులను అదుపులోకి తీసుకొన్నారు.



## బెట్టింగు సామ్రాట్టులు!

క్రికెట్ మ్యాచ్ బెట్టింగుల వెనుక నెల్లూరులోని వివిధ రాజకీయ పార్టీల నేతలున్నారని పోలీసులకు అనుమానం వచ్చింది. వెంటనే నలుగురు కార్పొరేటర్ల సెల్‌ఫోన్లపై నిఘా పెట్టారు. వీరిలో ఇద్దరు కార్పొరేటర్లు తెలుగుదేశం పార్టీకి చెందినవారు కాగా, మరో ఇద్దరు కాంగ్రెస్ పార్టీకి చెందిన వారు. ఈ నలుగురి గత చరిత్ర వెనుక పలు మచ్చలుండడంతో పోలీసు ఈ నిఘా పెట్టింది. కానీ పోలీసు నిఘా వీరు పసిగట్టేసి ఎప్పుడూ వాడే ఫోను నెంబర్లు కాకుండా వేరే నెంబర్లు వాడడం మొదలు పెట్టారు. క్రికెట్ బెట్టింగుల వెనుక శాసనసభ్యుల కుమారులు సైతం వున్నారని ఇటీవల పోలీసుల చేతికి చిక్కిన బుకీలు తెలియజేసినా వారి జోలికి వెళ్లేందుకు పోలీసులు సాహసించలేదు. ఇదేమి న్యాయం రాధికమ్మా!

## ఇంటి వద్దకే టెలికాం సేవలు

వివిధ ఫోన్ కంపెనీల పోటీని తట్టుకోను బిఎస్‌ఎన్‌ఎల్ తన సేవలను వినియోగదారుల ఇంటి వద్దకే తీసుకవెళ్లను నిశ్చయించింది. ల్యాండ్ లైన్, విల్‌ఫోన్, బ్రాడ్ బ్యాండ్ కొత్త కనెక్షన్లు, సిమ్ కార్డులు ఏవి కావాలన్నా 2355455 లేదా 94900 00250 నెంబర్లకు ఫోన్‌చేస్తే 24 గంటల్లో ఇంటి వద్దకే వెళ్లి ఇస్తామని టెలికాం జిఎం గోపి చెప్పారు. 1502 నెంబరుకు డయల్ చేసి ల్యాండ్ లైన్ వినియోగదారులు బిల్లు మొత్తాన్ని తెలుసుకోవచ్చన్నారు.

## రాజరాజేశ్వరమ్మ హుండీలో విదేశీ కరెన్సీ!

నెల్లూరు రాజరాజేశ్వరమ్మ దేవస్థానంలోని హుండీని గతవారం లెక్కించగా ఏడు లక్షల రూపాయల విలువైన నగదు, 649 గ్రాముల బంగారం, రెండు కిలోల 650 గ్రాముల వెండి వున్నాయని ఇఓ సుబ్బారావు చెప్పారు. ఈ మొత్తంతోపాటు 250 అమెరికన్ డాలర్లు సైతం పడ్డాయి.

## ప్రజాపథంలో గొడవ

నెల్లూరు నగరంలోని తూకుమానుమిట్ట ప్రాంతంలో జరిగిన ప్రజాపథం కార్యక్రమంలో తెలుగుదేశం, ప్రజారాజ్యం పార్టీ కార్యకర్తలు గొడవపడ్డారు. ఈ ప్రాంతం నుంచి తెలుగుదేశం పార్టీ కార్పొరేటర్‌గా గెలిచిన సుధీర్ ఆ తర్వాత పిఆర్పీలో చేరాడు. ఈ విషయమై టిడిపి కార్యకర్తలు నిలదీయడంతో గొడవ జరిగింది. టిడిపి కార్యకర్త నాగూర్ గాయపడ్డాడు.

## మొదలైన ట్రాఫిక్ ఆంక్షలు

నెల్లూరు నగరంలోని ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేందుకు ఎస్పీ దామోదర్ కొన్ని సంస్కరణలు చేపట్టారు. పగలు ఎనిమిది గంటల నుంచి రాత్రి ఎనిమిది గంటల వరకు నగరంలోకి లారీలు, టిప్పర్లకు ప్రవేశం లేదు. మినిబైపాసు రోడ్డులో మాత్రం లారీలు నడవవచ్చు. మధ్యాహ్నం ఒంటి గంట, మూడు గంటల మధ్య స్టోన్‌హౌస్‌పేటలోనికి సరకు లారీలకు అనుమతిస్తారు. లారీలు నగరంలోనికి ప్రవేశించకుండా వెంకటేశ్వరపురం, చిల్డ్రన్స్‌పార్క్, అయ్యప్పగుడి, చింతారెడ్డిపాళెం, ఇరుగాళమ్మ గుడి, తెలుగుగంగ ఆఫీసుల వద్ద పోలీసులు ప్రత్యేక పికెట్లు ఏర్పాటు చేశారు.



## టివిఎస్ సత్రంలో అభివృద్ధి పనులు

నెల్లూరు ట్రంకురోడ్డులోని తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం మేనేజింగ్ ట్రస్టీగా బాధ్యతలు తీసుకొన్న డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్ గడచిన నాలుగేళ్లలో పలు అభివృద్ధి కార్యక్రమాలు చేశారు. టివిఎస్ కళ్యాణ సదన్ను ఆధునీకరించి ఏ.సితో ముస్తాబు చేశారు. కర్మసత్రం భవన నిర్మాణంతోపాటు నూతన బ్రాహ్మణ వసతి భవనాన్ని పూర్తి చేయించారు. మే 9వ తేదీ బ్రాహ్మణ పార్థివ శరీర వసతి భవనాన్ని, బెంగుళూరులోని దత్తపీఠంలో మాదిరి అకాల మృత్యు మోక్ష స్థూప ఆవిష్కరణ, ఫౌండర్ జయంతి ఉత్సవం, బ్రాహ్మణ విద్యార్థుల ఉన్నత విద్యా ప్రోత్సాహక కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమంలో ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ కార్యదర్శి కె.వి.రమణాచారి, దేవాదాయ కమిషనర్ జెవిఎస్ ప్రసాద్ తదితరులు పాల్గొనను న్నారు.




నెల్లూరు టౌన్‌హాల్‌లో కవిత్రయ జయంత్యుత్సవాల్లో భాగంగా జరిగిన నన్నయ జయంతిసభలో వక్త డాక్టర్ సంగనభట్ల నరసయ్యను సన్మానిస్తున్న జెవి.రెడ్డి, పివి.రమణారెడ్డి, బివి.నరసింహం, అగస్త్యరెడ్డి వెంకురెడ్డి.

## నృసింహునికి బంగారు వాహనాలు

పెంచలకోనలోని నరసింహస్వామి సేవకై బంగారు వాహనాలను దేవస్థానం ఛైర్మన్ అమరా శ్రీరాములు శెట్టి సమకూర్చి పెట్టారు. 70 లక్షల రూపాయల వ్యయంతో తిరుమలలో చేయించిన బంగారు గరుడ, ఆంజనేయస్వామి వాహనాలను 28వ తేది మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తన చేతుల మీదుగా ప్రారంభించారు. 30వ తేదితో శ్రీరాములు శెట్టి పదవీకాలం పూర్తవుతుంది. తన హయాంలో పెంచలకోన దేవస్థానం అభివృద్ధికి ఆయన గట్టి కృషి చేశారనే చెప్పాలి.

## వికృతానందరెడ్డి

నెల్లూరు నగరంలో కాంగ్రెస్ పార్టీ ఎవరివల్ల భ్రష్టుపట్టిందో చర్చించేందుకు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ముందుకు రావాలని రాజీవ్‌భవన్ నిర్వాహకుడు అనిల్‌కుమార్ సవాల్ విసిరాడు. 26వ తేది విలేకరులతో మాట్లాడుతూ తనను ఓడించి ప్రజలు మంచి పని చేశారని వివేకా ఇటీవల ప్రజాపథం కార్యక్రమంలో వాఖ్యానించడాన్ని తప్పుపట్టారు. అనిల్ ఓటమి వెనుక చిదంబర రహస్యం అందరికీ తెలుసన్నారు. వివేకానందరెడ్డి, మేయర్ భానుశ్రీ చేష్టల వల్ల నెల్లూరులో కాంగ్రెస్ పార్టీ పరవు బజారున పడింది. వారు చేయని అవినీతి కార్యక్రమాలు లేవు. వివేకానందరెడ్డి వికృతానందరెడ్డిలా మారారు. ఆయనకు రాబోయే కార్పొరేషన్ ఎన్నికల్లో తమ సత్తా ఏమిటో చూపుతామన్నారు. ఈ సమావేశంలో వై.వి.రామిరెడ్డి కూడా పాల్గొన్నారు.

## కరీంనగర్ జిల్లా జడ్జిగా నెల్లూరీయుడు

నెల్లూరు చిన్నబజారులోని గర్ని వీధి వాసి షేక్ మహమ్మద్ రఫి కరీంనగర్ జిల్లా జడ్జిగా నియమితులయ్యారు. రఫి తండ్రి అమీర్ సాహెబ్ పూర్వాశ్రమంలో నెల్లూరు ఎసి సుబ్బారెడ్డి కూరగాయల మార్కెట్ పాలకవర్గం



అధ్యక్షుడిగా పనిచేసిన పెద్ద మనిషి. జెండావీధి మాజీ కౌన్సిలర్ షేక్ ఖుద్దూస్ సాహెబ్ రఫి పెదనాన్న. సర్వీసు ఇంకా వుండడం వల్ల రఫి హైకోర్టు జడ్జి కూడా అయ్యి నెల్లూరు పేరుప్రతిష్ఠలు పెంచాల్సి వుంది.

## ప్రభవలో వేసవి శిక్షణా శిబిరాలు

నెల్లూరు పొగతోటలోని ప్రభవ ఈసారి వేసవిలో పిల్లలకు, పెద్దలకు గ్రీష్మ ప్రభవ పేరిట శిక్షణా శిబిరాలు నిర్వహిస్తుంది. ప్రఖ్యాత సంగీత విద్వాంసులు టి.ఎస్.శేషాద్రి గారిచే సంగీత శిక్షణ, వేణుగోపాల్‌సాకారి గారిచే భరతనాట్య శిక్షణ, రంగాచార్యులు గారిచే నటనలో శిక్షణ, సురేష్‌బాబు గారిచే చిత్రకళలో, స్కిల్‌గురు గోగినేని బాబు గారిచే కమ్యూనికేషన్ స్కిల్‌తో కూడిన శిక్షణనిస్తారు. వీటికి తోడు ఇంగ్లీషులో ప్రత్యేక శిక్షణ కూడా వుంటుంది. ఆసక్తిగలవారు ప్రభవ నిర్వాహకురాలు చంద్రలతను సంప్రదించవచ్చు.

# పోలీసు జాగిలానికి యమ డిమాండ్!

## వ్యాపారం చేస్తున్న ట్రైనర్



నెల్లూరు పోలీసు శాఖలో వున్న నాలుగు జాగిలాలు సైతం తమ వంతు నేర పరిశోధనలో భాగస్వులు అవుతున్నాయి. మిస్టరీ కేసుల చేధనకు తమవంతు కృషి చేస్తున్నాయి. వీటిలో 'హెక్టార్' అనే జాగిలం గూర్చి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ప్రత్యేక జాతికి చెందిన హెక్టార్ అమిత చురుకైనది. చిన్న ఆధారం దొరికితే చాలు కొమ్ములు తిరిగిన హంతకుడినైనా పట్టిస్తుంది. ఈ ప్రత్యేకతే హెక్టార్‌కు కష్టాలు తెచ్చిపెడుతుంది. దీని శిక్షకునికి కాసులు కురిపిస్తుంది. హెక్టార్‌తో తమ ఇళ్లలోని కుక్కలను క్రాసింగ్ చేయిస్తే మంచి సంతానం పుడుతుందని పలువురు ఈ జాగిలం కోసం దీని శిక్షకుని సంప్రదిస్తున్నారు. ఈ శిక్షకుడు తెలివిగా హెక్టార్‌ను రాత్రి పూట కాపురం చేయించను తరలిస్తున్నట్లు ఫిర్యాదులు వెల్లువెత్తుతున్నాయి. ఎస్పీ ఈశ ముక్కల దామోదర్‌కు సైతం ఈ విషయమై ఫిర్యాదు అందినట్లు విశ్వసనీయంగా తెలిసింది. హెక్టార్‌తో తమ కుక్కలు చనువుగా మసలను 25వేల రూపాయలు సైతం చెల్లించిన వాళ్లు వున్నారు. ఓ రాత్రి హెక్టార్ జిల్లా మంత్రి రామనారాయణరెడ్డి ఇంటికి సైతం వెళ్లి నిద్రచేసి వచ్చిందట. హెక్టార్ పిల్లలంటూ నెల్లూరు మార్కెట్‌లో మంచి రేటుకు అమ్మకాలు జరుగుతున్నాయి. నోరులేని మూగజీవమని హెక్టార్‌ను పోలీసులు ఈ విధంగా బలహీనపర్చి సొమ్ము చేసుకోవడం దారుణం. ఈవిధంగా తిప్పే పోలీసు శాఖలో ఓ జాగిలాన్ని గతంలో బలహీనపర్చి అది పనికిరాదని ఉన్నతాధికారులకు రిపోర్టు పంపిన ప్రబుద్ధులు ఆ శాఖలో వున్నారు. హెక్టార్ తిరుగుళ్లపై ఎస్పీ దర్యాప్తు చేయిస్తే యదార్ధ విషయాలన్నీ తెలుస్తాయి. దీనికి బాధ్యులైన వారిపై చర్యలు తీసుకోవాల్సి వుంది.

# సందాని భూ దాహం తీరదా?

నెల్లూరు నగరంలోని ఏ మూలలోని స్థలమైన లక్షలు పలుకుతున్న రోజులివి. ఇటువంటి పరిస్థితుల్లో నెల్లూరు కార్పొరేషన్ ఆఫీసు నుంచి ఖుద్దూస్‌నగర్‌కు విస్తరించి వున్న ప్రాంతం ఈ మధ్య అనూహ్యంగా అభివృద్ధి



ఇటువంటి దురాక్రమణలు లెక్కలేనన్ని...

చెందడంతో ఇక్కడ అంకణం స్థలం లక్ష రూపాయలు నిక రంగా పలుకుతుంది. ఈ ప్రాంతంలో పలు ఇరిగేషన్, వక్ఫ్ బోర్డు, కార్పొరేషన్ రిజర్వు స్థలాలతోపాటు శివాయి జాగాలు లెక్కలేనన్ని వున్నాయి. ఈ స్థలాలకు రకరకాల డూప్లికేట్ డాక్యుమెంట్లు సృష్టించి సీనియర్ కార్పొరేటర్ సందాని బాష ఆక్రమించి పారేశాడు. ఇటీవల ఈ ప్రాంత అభివృద్ధికి విడుదల చేయించుకున్న కోటి రూపాయల నిధులతో తాను ఆక్రమించిన స్థలాలకు ప్రాథమిక సౌకర్యాలు కల్పించుకొంటున్నాడు. ఈ ప్రాంతంలో ఆయనకు అడ్డులేదు. పైపెచ్చు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఆశీర్వాదం కూడా వుండడంతో ప్రశ్నించేవారు లేకుండా పోయారు. ఎంత తక్కువ అనుకొన్నా 750 అంకణాల నుంచి వెయ్యి అంకణాల మేర వివిధ ప్రభుత్వ స్థలాలను ఆక్రమించి

**వాకర్స్ రోడ్డు - ఖుద్దూస్‌నగర్‌ల మధ్య వెయ్యి అంకణాల దురాక్రమణ**

ప్లాట్లుగా విభజించి జల్సాగా అమ్మేస్తున్నాడాయన. ఈ మధ్య ఆయన వాకర్‌రోడ్డును ఆనుకొని ఓ స్థలాన్ని ఆక్రమించి పక్కా బిల్డింగ్ కట్టించారు. కోటమిట్ట వెనుక పార్కు కోసం రిజర్వు చేసిన స్థలాన్ని సైతం అమ్మకానికి పెట్టారు. గతంలో సందానితో ప్రత్యక్ష పోరాటం చేసే మైనార్టీ నేతలందరికీ ఆయన చిన్నాచితక స్థలాలు పంచేయడంతో ఈ ప్రాంతంలో జరిగిన కోట్ల రూపాయల భూకబ్జా వెలుగు చూడడమే లేదు. ఇప్పటికైనా అధికార యంత్రాంగం రంగంలోకి దిగి ఏ స్థలం ఏ శాఖదన్న విషయం పరిశీలిస్తే సందాని భూ దురాక్రమణలన్నీ బయటపడడం ఖాయం.

# కార్యకర్తల ఆకాంక్షలకు అనుగుణంగా టిక్కెట్లు



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న శ్రీధర్‌రెడ్డి, అనిల్‌కుమార్.

క్రిందిస్థాయి కార్యకర్తలు, అభిమానుల అభిప్రాయాలు, ఆకాంక్షలకు అనుగుణంగానే రాబోయే మునిసిపల్ కార్పొరేషన్ ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులను ఎంపిక చేస్తామని రాజీవ్‌భవన్ నేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ప్రకటించారు. కాంగ్రెస్ నేతలు డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్, వై.వి.రామిరెడ్డి, చెన్నారెడ్డిలతో కలిసి విలేకరుల సమావేశం నిర్వహించారు. రానున్న ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ కార్పొరేషన్‌ను హస్తగతం చేసుకొనేందుకు వీలుగా పార్టీని బలోపేతం చేస్తామన్నారు. కాంగ్రెస్ పార్టీ ఎవరి జాగీరు కాదని, కార్యకర్తలే పార్టీకి ఊపిరి అని, రాజీవ్‌భవన్ ఏర్పాటుచేసి ఈ విషయాన్ని నిరూపించామన్నారు. అట్టడుగు స్థాయి నుంచి పార్టీని అభివృద్ధి చేసేందుకుగాను ఏప్రెల్ 28 నుంచి ఎస్‌బిఎస్ కళ్యాణ మండపంలో శిక్షణా తరగతులను నిర్వహిస్తున్నట్లు చెప్పారు. 28వ తేది 1 నుండి 11 డివిజన్ల వరకు, మే 10న 12 నుంచి 25 డివిజన్ల వరకు, మే 20న 26 నుంచి 38 డివిజన్లకు, మే 30న మిగిలిన డివిజన్లలోని కార్యకర్తలకు శిక్షణా తరగతులు జరుగుతాయన్నారు. ఈ కార్యక్రమాలకు జిల్లా పరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధనరెడ్డి, సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకరరెడ్డి విచ్చేసి కార్యకర్తలకు తగిన సూచనలు, సలహాలు అందజేస్తారని తెలిపారు.

# మట్టిగొట్టుకొంటున్న రోడ్లు



ఎర్రమట్టితో నిండిన పొదలకూరు రోడ్డు.

రహదారులు ప్రగతికి చిహ్నాలంటారు. నెల్లూరు నగరంలోని రహదారులపై మట్టి మషాణం నిండుకోవడంతో వాహన చోదకులు, పాదచారులు పడుతున్న పాట్లు వర్ణనాతీతంగా వున్నాయి. అయ్యప్పగుడి నుంచి ఆత్మకూరు బస్టాండ్ వరకున్న ట్రంకు రోడ్డును కార్పొరేషన్ శానిటరీ ఉద్యోగులు ప్రతిదినం శుభ్రపరచడం లేదు. దీంతో గాలివీస్తే రోడ్డులోని మట్టి మషాణమంతా రోడ్డుపై పోతున్న వారిపై వచ్చి పడిపోతుంది. నెల్లూరు పొదలకూరు రోడ్డులో ఇటీవల పైపులైను పనులు చేపట్టారు. ఈ సందర్భంగా మూడు కిలోమీటర్ల మేర రోడ్డు ప్రక్కన గుంటలు త్రవ్వారు. ప్రతినిత్యం ఈ పైపులైను లీక్ అవుతుండడంతో మళ్లీ త్రవ్వకాలు చేస్తూనే వున్నారు. ఈ నేపథ్యంలో ఎర్రమట్టి విపరీతంగా లేస్తుండడంతో వాహన చోదకులు రంగుమారి పోతున్నారు. కళ్లలో పడే ఎర్రమట్టితో ప్రజలు ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. నగరం కార్పొరేషన్ అయ్యాక కూడా రోడ్లపై మట్టి మషాణం తొలగింపుకు ప్రయత్నించక పోవడం దారుణం. పురపాలక శాఖా మంత్రి ఇలాఖాలోనే ఇంత అధ్వాన్న పరిస్థితులుండడం ఆక్షేపణీయం కాదా?

**ఇబ్బందులు పడుతున్న వాహన చోదకులు**

# ఇదేమి చోద్యం

## విద్యాసంస్థల్లో ప్రైవేటు సైన్యం!

రౌడీలు, గూండాలను రాజకీయ నేతలు పెంచి పోషిస్తుంటారనేది పలు సందర్భాలలో రుజువయ్యింది. తర్వాత కాలంలో వ్యాపార సంస్థలు, ఫైనాన్స్ కంపెనీలు బాకీల వసూళ్లకు వారిని చేరదీస్తున్నాయి. ఈ జాడ్యం ఇపుడు విద్యాసంస్థలకు విస్తరించింది. కొన్ని కార్పొరేట్ విద్యాసంస్థలు రౌడీలను చేరదీసి తమ అవసరాలు తీర్చుకొంటూ చెప్పుచేతుల్లో పెట్టుకొంటున్నారు. కళాశాలల్లో గొడవలు జరిగినపుడు, విద్యార్థులకు సంబంధించి తల్లితండ్రులు, బయటి వ్యక్తులు యాజమాన్యంపై గొడవకు వచ్చినపుడు, లేక కళాశాలల్లో చదివే విద్యార్థినీ, విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకొన్నప్పుడు ఆయా వ్యక్తుల కుటుంబాల నుంచి ప్రతిఘటన ఎదురుకాకుండా ఈ రౌడీ మూకలను రంగంలోకి దించుతారు. ఆ గూండాలు విద్యార్థులు, వారి తల్లితండ్రులపై, వారి తరపు వారిపై తమ ప్రతాపాన్ని చూపి బెదిరింపులకు పాల్పడుతుండడంతో దానికి జడిసి పలువురు వెనక్కు తగ్గుతున్నారు. నగరంలో పేరొందిన విద్యాసంస్థలు ఈ రౌడీ గ్యాంగులను పెంచి పోషించడంపై సర్వత్రా విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ముఖ్యంగా తరచూ ఆత్మహత్యలకు పాల్పడుతున్న ఓ కళాశాల ఈ గ్యాంగులను ఏర్పాటుచేసుకోవడం పట్ల విద్యార్థులు, తల్లితండ్రులు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు.


నెల్లూరులో క్రికెట్ బెట్టింగ్ ముఠాతో డిఎస్పీ రాధిక, సిఐ వీరాంజనేయరెడ్డి.

# • నెల్లూరులో

# నేర సామ్రాజ్యం!

**నగరంలోని ఒకటవ, ఐదవ పట్టణ పరిధిలోని పలు ప్రాంతాల్లో క్రికెట్ మ్యాచ్‌లు జరిగిన రోజు లక్షల్లో బెట్టింగులు కాస్తున్నారు. ఈ వ్యాపారాన్ని అధికార, ప్రతిపక్షాలకు చెందిన ద్వితీయశ్రేణి నేతలు నిర్వహిస్తుండడం విశేషం.**

మామూళ్లకు అలవాటు పడిన పోలీసులు అనతికాలంలోనే కోట్లరూపాయలు సంపాదించాలన్న బుక్కీల ఆశల నడుమ సామాన్య మధ్యతరగతి ప్రజలు విలవిలలాడిపోతున్నారు. దేశంలో ప్రస్తుతం జరుగుతున్న ఐ.పి.ఎల్ క్రికెట్‌కు భారీస్థాయిలో బెట్టింగ్‌లు జరుగుతున్నాయి. క్రికెట్ బెట్టింగ్‌లను అరికట్టాల్సిన పోలీసులు సైతం నిర్వాహకుల వద్ద నుంచి తరచూ మామూళ్లు దండుకుంటూ చూసీచూడనట్లుగా వ్యవహరిస్తున్నారు. నెల్లూరు నగరంలో రోజుకు రెండు లక్షల రూపాయల నుంచి పది లక్షల వరకు బెట్టింగ్ వ్యాపారం సాగుతుంది.

ఈ బెట్టింగ్ వ్యవహారమంతా ఒకటవ నగర పోలీస్‌స్టేషన్ పరిధిలో అధికంగా జరుగుతుంటుంది. క్రికెట్ బెట్టింగ్ జరుగుతున్న విషయం సంబంధిత స్టేషన్ ఎస్.ఐలకు తెలిసినా కూడా ఉదాసీనవైఖరి అవలంభిస్తున్నారన్న ఆరోపణలు వున్నాయి. ఆర్థిక నేరాలను సాధ్యమైనంత వరకు నియంత్రించాలని జిల్లా ఎస్పీగా బాధ్యతలు స్వీకరించిన దామోదర్ పోలీసులను ఆదేశిస్తున్నా ఆశించిన మేర ఫలితాలు రావడం లేదు. మధ్యతరగతి కుటుంబాలు క్రికెట్ బెట్టింగ్‌లో చిక్కుకుని ఆర్థికంగా చితికిపోతున్నాయి. ఇటువంటి సంఘటనలు రోజురోజుకు ఎక్కువవుతున్నా పట్టించుకునే వారు లేకుండా పోయారు.

కుక్కలగుంటలోని మహాలక్ష్మమ్మ గుడి సమీపంలో వున్న ఒక సైకిల్‌షాపు క్రికెట్ బెట్టింగ్‌లకు ప్రధానకేంద్రంగా మారింది. పేరుకే సైకిల్‌షాపు నిర్వహిస్తు ఉదయం నుంచి రాత్రి వరకు ఆర్థిక లావాదేవీలు చేస్తుంటారు. ఈ బెట్టింగ్‌లకు చేతుల్లో నగదు లేని సమయంలో ఇంటిస్థలాలకు సంబంధించిన రిజిస్ట్రేషన్ డాక్యుమెంట్లు, నగలు తాకట్టుపెడుతుంటారు. ఆదాయం సంగతి దేవుడెరుగు చేతిలోని నగదు, ఆస్తుల పత్రాలు పోగొట్టుకుంటున్నామని బాధితులు తీవ్ర ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఈ వ్యవహారంలో ఒకసారి కాలుమోపితే వెనకడుగు వేసే ప్రసక్తి వుండదు.

## సింగిల్ నెంబర్లాట!

ఇదే ప్రాంతంలో సింగిల్‌నెంబర్లాట కూడా జోరుగా సాగుతుంది. ఈ నెంబర్లాటలో రోజువారి కూలీ చేసుకొని జీవించే కుటుంబాలు చిక్కుకుంటున్నాయి. ఒకటికి పదిరెట్లు ఆదాయం వస్తుందన్న ఆశతో సంపాదించిన సొమ్మును ఇందులో పెడుతున్నారు. సింగిల్ నెంబర్లాట నిర్వహించడం చట్ట ప్రకారం నేరమైనా మూడు పువ్వులు ఆరు కాయలుగా ఆట సాగిపోతుంది. 9 నుంచి 0 వరకు వున్న అంకెలను ముందుగా ఎంచుకొని నచ్చిన సంఖ్యపై అయిదువందల నుంచి వెయ్యిరూపాయల వరకు పందెం వేస్తారు. ఏదో ఒక నెంబర్‌ను చెన్నై నుంచి విడుదల చేశారని ప్రకటిస్తుంటారు.

తక్కువ సొమ్ము ఏ నెంబర్‌పైన పందెం వేసివుంటారో ఆ నెంబర్ వచ్చిందని నగదు చెల్లించి మిగిలిన నెంబర్లపై వచ్చిన సొమ్మును నిర్వాహకులు తీసుకుంటారు. ఈ జూదం ఆడిన వారిలో ఆర్థికంగా బాగా చితికిపోయిన వారే అధికంగా వున్నారు. ఈ సింగిల్ నెంబర్లాట జూదం నెల్లూరు నగరంతోపాటు కావలి, గూడూరు, సూళ్లూరుపేట, అల్లూరు తదితర ప్రాంతాలకు ఇటీవలకాలంలో బాగా విస్తరించిందంటే ఆశ్చర్యపోక తప్పదు. కష్టపడి సంపాదించిన సొమ్ము సింగిల్ నెంబర్లాటలో పొగొట్టుకొని విలవిలలాడుతుంటే నిర్వాహకులు అనతి కాలంలోనే కోట్లు గడిస్తున్నారు.

ఉన్నతాధికారుల నుంచి ఒత్తిళ్లు వచ్చిన సమయంలో మాత్రమే పోలీసులు సింగిల్ నెంబర్లాట నిర్వహిస్తున్న కేంద్రాలపై దాడులు చేస్తుంటారు. పోలీసులు నిర్వహించిన దాడులలో కూడా అసలు సూత్రధారులు దొరకరు. అసలు సూత్రధారులు ఎవరన్న విషయం పోలీసులకు తెలిసినా కూడా పట్టించుకోరు. అధికారుల నుంచి ఎటువంటి ఒత్తిళ్లు లేకుంటే ఈ కేంద్రాలవైపు కన్నెత్తి చూడరు. ఇటీవల నెల్లూరు నగర డిఎస్పీ రాధిక ఒకటవ నగర పోలీస్‌స్టేషన్ పరిధిలో నేరాల నియంత్రణపై నిర్వహించిన ఒక సదస్సులో పాల్గొని మంచి ఉపన్యాసం ఇవ్వడం జరిగింది.

ఒకటవ నగర పోలీస్‌స్టేషన్ పరిధిలో నేరాలు ఎలా జరుగుతున్నాయి? సింగిల్ నెంబర్లాట నిర్వహిస్తున్నవారు ఎవరు తదితర విషయాలపై సంబంధిత పోలీసులతోపాటు సదస్సుకు హాజరైన వారిని డిఎస్పీ ప్రశ్నించారు. అయితే డిఎస్పీ అడిగిన ప్రశ్నలకు ఒక్కరు కూడా సమాధానం చెప్పలేకపోయారు. సదస్సు ముగిసిన తర్వాత బయటకు వెళ్లి గుసగుసలాడారు తప్ప జూదం నిర్వహించే వారి పేర్లను వెల్లడించలేకపోయారు. నిర్వాహకుల పేర్లను వెల్లడిస్తే పోలీసులు పెద్దగా చర్యలు తీసుకోరన్న కారణంతోపాటు ఎక్కడ తాము చిక్కుల్లో పడతామన్న భయంతో మౌనంగా వుండిపోయినట్లు తెలుస్తుంది.

## ప్రక్కదారి పడుతున్న యువత

మారుతున్న పరిస్థితుల ప్రభావం పాశ్చాత్య సంస్కృతి కారణంగా యువతరం ప్రక్కదారి పడుతుంది. ఎటువంటి శ్రమ చేయకుండానే విలాసవంతమైన జీవితం గడపాలని నేటి యువత ఆశిస్తుంది. ఇందుకోసం ఎంతటి దుస్సాహసానికైనా ఒడిగడుతున్నారు. దోపిడీలు, దొంగతనాలు, కిడ్నాప్‌లకు సైతం పాల్పడుతున్న సంఘటనలు రాష్ట్ర వ్యాప్తంగా అనేకం జరిగాయి. నెల్లూరు నగరంలో నగదు కోసం కిడ్నాప్‌లు, హత్యలు జరగకపోయినా దోపిడీలు, దొంగతనాలు ఎక్కువగానే జరుగుతున్నాయి.

15 సంవత్సరాల వయసు కలిగిన వారి నుంచి 40 సంవత్సరాల నిండిన వారి వరకు దోపిడీలు, దొంగతనాలకు పాల్పడుతున్నారు. మోటారు బైక్‌లను అపహరించడం, మహిళల మెడలో చైన్‌లను లాక్కెళ్లడం, బ్యాంకు నుంచి నగదు డ్రా చేసి తీసుకెళుతున్న వారిని మాయమాటలు చెప్పి నగదు ఎత్తుకెళ్లడం వంటి చర్యలకు పాల్పడుతున్నారు. పోలీసులు నిందితులను అరెస్టు చేసిన సమయంలో చెడు వ్యసనాలకు బానిసై విలాసవంతమైన జీవనం గడిపేందుకు ఇటువంటి నేరాలకు పాల్పడుతున్నట్లు చెప్పడం షరా మూములే.

ఇటువంటి నేరాలకు పాల్పడుతున్న వారిని పట్టుకోలేక పోలీసులు నానాఅవస్థలు పడుతుంటే నగలు తయారుచేసి ఇచ్చేవారే వుద్దేశ్యపూర్వకంగా నగలను దాచి అపహరించుకు వెళ్లారని కట్టుకథలు అల్లడం పోలీసులకు సవాల్‌గా మారింది. ఇటువంటి సంఘటనలు ఇటీవలకాలంలో తరచూ చోటు చేసుకుంటున్నాయి. లక్షలాదిరూపాయల విలువ చేసే నగలను కాజేయాలని ముందుగానే నిర్ణయించుకుంటున్నారు. ఇలా చేసిన వారందరూ కొంత ఆలస్యమైనా కటకటాలపాలై వున్నారు. నగలను తయారు చేయమని బంగారం ఆర్డర్ ఇచ్చిన వారు ఏదో ఒక విధంగా మోసపోతున్నారు.

కోట్లాది రూపాయల విలువ చేసే బంగారు నగలు కళ్లముందు వుండడం, కష్టపడకుండా విలాసవంతంగా గడపాలన్న దురాశతో బంగారు పనిచేసే కొందరు యువకులు మోసాలకు పూనుకుంటున్నారు. నెల్లూరు నగరంలో మూడు నెలల క్రితం కోటిరూపాయల విలువ చేసే బంగారు, కొంత నగదు నగల దుకాణంలో చోరి జరిగింది. ఈ చోరీని సమీప బంధువులే చేసి ఏమీ తెలియనట్లుగా వ్యహరించారు. కేసు నమోదు చేసుకున్న పోలీసులు వివిధ కోణాలలో విచారణ చేపట్టి చివరకు ఇంటి దొంగలే ఈ పని చేశారని నిర్ధారించి మొత్తం రికవరీ చేసి కేసును చేధించారు.

పదిరోజుల క్రితం కోటమిట్ట సమీపంలో 30 లక్షలు విలువ చేసే బంగారు నగలను ఖాదర్ మొహిద్దీన్, సాబిర్‌లు దాచిపెట్టి గుర్తు తెలియని వ్యక్తులు కత్తులు చూపించి అపహరించుకు వెళ్లారని పోలీసులకు ఫిర్యాదు చేశారు. పోలీసులు రంగ ప్రవేశం చేసి తమదైన శైలిలో ఫిర్యాదు చేసిన వారిని విచారణ చేయడంతో వాస్తవాలు వెలుగు చూశాయి. దాచిపెట్టిన బంగారాన్ని స్వాధీనం చేసుకొని కటకటాల వెనక్కు నెట్టారు.

ఇదిలావుండగా నగలు తయారు చేయమని ఆర్డర్ ఇస్తున్న పెద్ద పెద్ద వ్యాపారులు కూడా మోసాలకు పాల్పడుతున్నారన్న ప్రచారం వుంది.

చెన్నైకు చెందిన లలితా జ్యూయలరి అధినేత ఇచ్చిన ఆర్డర్ ప్రకారం నగలు తయారుచేసి ఇవ్వకుంటే బంగారంలో కొంత కోత విధిస్తుంటాడని అంటున్నారు. ఇలా కోత విధిస్తున్న కారణంగా ఎంతో మంది నగలు తయారు చేసేవారు ఆర్థికంగా దెబ్బ తింటున్నారు. లలితా జ్యూయలరి అధినేత అవలంభిస్తున్న పోకడల కారణంగా అతన్ని ఇబ్బంది పెట్టాలన్న వుద్దేశంతో నగలు దాచిపెడతారని నగరంలో ప్రచారం వుంది. మొత్తం మీద నేటి యువత దురలవాట్లకు బానిసై భవిష్యత్‌ను నాశనం చేసుకుంటున్నది.

**జమీన్‌రైతు**

పొగతోట, నెల్లూరు - 524 001

ఫోన్: 0861 - 2327354

సెల్: 98489 66190

జీవిత చందా రూ.1000లు

సంవత్సర చందా

స్వదేశంలో రూ.200లు

విదేశాలకు రూ.1000లు


ప్రజాపథం కార్యక్రమంలో నెల్లూరు తూకుమానుమిట్టలో ప్రజారాజ్యం, తెలుగుదేశం కార్యకర్తల మధ్య వాగ్వివాదంలో గాయపడ్డ నాగూర్.


నెల్లూరులోని గోపిశెట్టి శంకరయ్య చారిటబుల్ ట్రస్ట్ నేతృత్వంలో అంబాపురంలోని బెతల్ ఆర్ఫనేజ్‌కు పదివేల రూపాయల ఆర్థిక సహాయాన్ని జాయింట్ కలెక్టర్ సౌరబ్‌గౌర్ ద్వారా అందజేస్తున్న ట్రస్టీలు కె.బాలసుబ్రహ్మణ్యం, మోడెం కోటారెడ్డి, వొమ్మిన సుబ్రహ్మణ్యం.



నెల్లూరు కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న పంచాయితీల సర్పంచులతో ఎమ్మెల్సీ రాజేంద్రప్రసాద్.

## పేదల కోసమే ప్రజాపథం!

**సర్వేపల్లిలో ఆదాల వెల్లడి**

పేద ప్రజలకు మౌలిక వసతులు కల్పించాలన్న లక్ష్యంతోనే ప్రజాపథం కార్యక్రమానికి దివంగత రాజశేఖర్‌రెడ్డి శ్రీకారం చుట్టారని సర్వేపల్లి శాసన సభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి తెలిపారు. తోటపల్లి గూడూరు మండలంలోని పాపిరెడ్డి పాళెంలో ప్రారంభమైన ప్రజాపథం కార్యక్రమానికి జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్ రెడ్డితో కలసి పాల్గొన్నారు. వేసవి కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో త్రాగునీరు, విద్యుత్, వీధిదీపాలు తదితర సౌకర్యాలను మెరుగుపరచేందుకు ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నట్టు తెలిపారు. ఆరోగ్యశ్రీ, ఉపాధిహామీ పథకం, 104, 108 సేవలను ప్రజలకు అందుబాటులోకి తెచ్చేందుకు తగిన చర్యలు తీసుకొంటున్నామన్నారు. అర్హులైన వారికి తిరిగి పింఛన్ అందేవిధంగా చూస్తామన్నారు. 7కోట్ల రూపాయలతో గ్రామీణ ప్రాంతాల్లో రోడ్డు నిర్మాణం చేపడుతున్నట్లు వివరించారు. రైతుల అవసరాలను దృష్టిలో వుంచుకొని జాఫర్‌సాహెబ్ డిస్ట్రిబ్యూటరీ కెనాల్ ఆధునీకరణ పనులను తాత్కాలికంగా నిలిపివేశామని, రెండోపంటకు పుష్కలంగా నీరు అందించేందుకు చర్యలు తీసుకొంటున్నామన్నారు. జడ్పీఛైర్మన్ గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ పాపిరెడ్డిపాళెంలో త్రాగునీటి సమస్యలను పరిష్కారించేందుకు రెండు లక్షల రూపాయలను మంజూరు చేస్తున్నట్లు ప్రకటించారు. ఈ కార్యక్రమంలో పలువురు అధికారులు, మండల నాయకులు పాల్గొన్నారు.

## నీటికోసం పాట్లు

**బొంతారాజుపాళెంలో ఫ్లోరైడ్ నీళ్లు త్రాగుతున్న జనం**

పొదలకూరు మండలం బొంతారాజుపాళెంలో ప్రజలు మంచినీటి కోసం కష్టాలు పడాల్సి వస్తున్నది. నెలరోజులుగా త్రాగునీరు లేకపోవడంతో దూర ప్రాంతాలకు పోయి నీటిని తెచ్చుకోవాల్సి వస్తున్నది. గ్రామంలోని వారికి త్రాగునీటిని అందించేందుకు పంచాయితీ కేంద్రమైన దేగపూడిలో 15ఏళ్ల క్రితం ఓవర్‌హెడ్ ట్యాంక్ నిర్మించి, 3 కిమీ పైప్‌లైన్ వేశారు. అయితే అది నేడు శిథిలావస్థకు చేరుకొన్నది. దీనికితోడు ఓవర్‌హెడ్ ట్యాంకుకు కండలేరు వాటర్ స్కీం నుంచి వచ్చే నీటి సరఫరా సక్రమంగా జరగకపోవడంతో గ్రామంలో త్రాగునీటి ఎద్దడి నెలకొంది. గ్రామస్తులు గత్యంతరం లేని పరిస్థితుల్లో గ్రామంలోని బోర్లలో వచ్చే ఫ్లోరైడ్ నీటినే త్రాగాల్సి వస్తోంది. ఫలితంగా తీవ్ర అనారోగ్యానికి గురవుతున్నామని స్థానికులు వాపోతున్నారు. కండలేరు వాటర్ స్కీం పైపు లైను నుంచి లీకవుతున్న నీటిని పట్టుకొని దాహార్తిని తీర్చుకొంటున్నారు గ్రామస్తులు. వేసవి తీవ్రతరం అవుతున్న పరిస్థితుల్లో గ్రామానికి నీటి సరఫరా సక్రమంగా జరిగేలా అధికారులు చర్యలు చేపట్టాల్సి వుంది.

● ప్రభుత్వశాఖల మధ్య

## అద్దె తగాదా!

ఇందుకూరుపేట మండల పరిషత్, రెవిన్యూ శాఖల మధ్య వివాదం ముదురుతుంది. లక్షల్లో పేరుకపోయిన అద్దె బకాయిలే ఈ వివాదానికి కారణం. దాదాపు 15 ఏళ్ల నుంచి మండల తహశీల్దార్ కార్యాలయం అద్దె చెల్లించకపోవడంతో షుమారు 10లక్షల రూపాయలు బకాయిలుగా పేరుకపోయాయి. తహశీల్దార్ కార్యాలయానికి స్వంత భవనం లేకపోవడంతో ప్రజాపరిషత్ భవన సముదాయంలోనే అద్దె చెల్లించేలా కొంత భాగాన్ని కేటాయించారు. తొలినాళ్లలో అద్దె చెల్లిస్తున్నా 15 ఏళ్ల నుంచి ఒక్కపైసా చెల్లించలేదు. ఈ విషయమై ఇటీవల ఎంపిటిసిలు, ఎంపిపి, ఎంపిడిఓపై ఒత్తిడి తీసుకవచ్చారు. ఆ మొత్తం మండల అభివృద్ధికి ఉపయోగపడుతుందని చెప్పిన ఎంపిటిసిలు మండల సభలో తీర్మానాన్ని ఆమోదింపజేశారు. అయినా బకాయిపడ్డ అద్దె మొత్తం చెల్లింపు జరగకపోవడంతో దీనిపై ఉద్యమించేందుకు ఎంపిటిసిలు సిద్ధమవుతున్నారు.

**మండల పరిషత్ X రెవిన్యూ**

## అంధకారంలో ఇందిరమ్మ ఇళ్లు!

● నారికేళ్లపల్లిలో పరిస్థితిది.

ముత్తుకూరు మండలంలో నిర్మించిన ఇందిరమ్మ ఇళ్లకు రెండున్నర సంవత్సరాలుగా విద్యుత్ సౌకర్యం లేకపోవడంతో పేదలు అంధకారంలో మగ్గాల్సి వస్తోంది. నారికేళ్లపల్లి పంచాయితీ పరిధిలోని సుబ్బారెడ్డి పాళెంలో 35 ఇళ్లను ఇందిరమ్మ పథకం క్రింద నిర్మించారు. గృహనిర్మాణశాఖ, ట్రాన్స్‌కో అధికారుల మధ్య సమన్వయం లోపించడంతో అది పేదలపాలిట శాపంగా మారింది. విద్యుత్ సౌకర్యం లేక చీకటిలో గడపాల్సివస్తోంది. గ్రామానికి దూరంగా, స్మశానానికి దగ్గరలో నిర్మించి వుండే ఈ గృహాల నుంచి చీకటిపడితే బయటకు రావాలంటే పేదలు హడలిపోతున్నారు. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా అన్న ఆలోచనతో జీవనం సాగించాల్సి వస్తోందని కాలనీవాసులు వాపోతున్నారు. రెండున్నరేళ్లుగా తమ ఇళ్లకు విద్యుత్ సౌకర్యం లేకపోవడంతో దీని కోసం మండల నాయకులు, అధికారుల చుట్టూ కాళ్లరిగేలా తిరిగినా ప్రయోజనం లేదని, ఎవ్వరూ తమ గోడు పట్టించుకోవడం లేదని లబ్దిదారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

## ఇబ్బందుల్లో కావలి మునిసిపాలిటీ!

అంగట్లో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని అన్న చందంగా వుంది కావలి మునిసిపాలిటీ పరిస్థితి. నిధులు వున్నా వాటిని డ్రా చేసుకొనేందుకు ఖజానా అధికారులు ఎల్ఓసి అనుమతులు ఇవ్వలేదు. దీంతో మునిసిపాలిటీ ఆర్థిక ఇబ్బందులతో కొట్టుమిట్టాడాల్సిన పరిస్థితి నెలకొనింది. విద్యుత్ బిల్లులకు మినహా ఎలాంటి పనులకు ఎల్ఓసి రాలేదు. ఈ కారణంగా పరిపాలన పూర్తిగా స్తంభించింది. సిబ్బందికి జీతాలు లేవు. చెత్త తరలించే వాహనాలకు డీజిల్ లేదు. కాలిన బల్బులను మార్చి క్రొత్త వాటిని కొనుగోలు చేసేందుకు డబ్బులేవు. మంచినీటి సరఫరా పనుల మరమ్మత్తులకు నిధులు లేక పాలన అస్తవ్యస్తం అయ్యింది.

### ఎల్ఓసి కారణంగా స్థంభించిన పాలన

చివరకు అనాథ శవాలను ఖననం చేసేందుకు కూడా సొమ్ము చెల్లించలేని దీన స్థితిలో వుంది కావలి మునిసిపాలిటీ. మునిసిపల్ శాఖమంత్రి సొంత జిల్లాలోనే ఇలాంటి పరిస్థితి ఏర్పడడం పట్ల పలువురు ఆవేదన చెందుతున్నారు. మునిసిపాలిటీకి నిధులు వున్నా వాటిని ఖర్చు చేసేందుకు ట్రెజరీ నుంచి అనుమతులు రాకపోవడంతో ఏమీ చేయలేని దుస్థితిలో చిక్కుకొంది. ఉన్నతాధికారులు తక్షణం స్పందించి మునిసిపల్ నిర్వహణకు అవసరమైన నిధులు ఖర్చుచేసుకొనే అవకాశం కల్పిస్తూ ఎల్ఓసి ఇప్పించాలని పట్టణ ప్రజలు కోరుకొంటున్నారు.

## ఎంఇఓపై టీచర్ దౌర్జన్యం

పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పాల్సిన ఉపాధ్యాయులే వీధి రౌడీల్లా ప్రవర్తించిన ఘటన కలువాయిలో చోటు చేసుకొంది. జనగణన విధుల కేటాయింపులో మండల విద్యాధికారి బాలకృష్ణారెడ్డి నిబంధనలకు విరుద్ధంగా ప్రవర్తించాడంటూ ఉపాధ్యాయ సంఘాలు తహశీల్దార్ ఎదుట గొడవకు దిగాయి. ఎంఇఓపై చర్యలు తీసుకోవాలంటూ ఎంపిడిఓకు ఫిర్యాదు చేశారు. దీంతో నెల్లూరు ఆర్డీవో ఆదేశాల మేరకు ఆత్మకూరు డిఎస్పీ పర్యవేక్షణలో జనగణన శిక్షణ పూర్తయ్యింది. తాము ఫిర్యాదుచేసిన విధంగా ఎంఇఓపై చర్యలు తీసుకోకపోవడంతో ఆగ్రహించిన కృష్ణారెడ్డి అనే ఉపాధ్యాయసంఘ నాయకుడు అధికారులందరి ముందు ఎంఇఓని వుద్దేశించి నీ జాతకం నా దగ్గర వుంది... నీగుట్టు అంతా బైటపెట్టి నీఅంతు చూస్తానని బెదిరించాడు. ఇంతగా వీధి రౌడీలా ప్రవర్తించిన ఆ టీచర్‌ను చూసి అధికారులు విస్తుపోయారు.

# మండలానికి ఐదు లక్షలు!

## మంచినీటి సమస్య పరిష్కారానికి వెంకటగిరి ఎమ్మెల్యే వితరణ



అర్హులైన పేదలందరికీ భూపంపిణీ జరిగేలా చర్యలు చేపడుతామని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ తెలిపారు. తెలుగుదేశం పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమంలో భాగంగా కలువాయిలో జరిగిన పార్టీ కార్యకర్తల సమావేశంలో పాల్గొన్నారు. ప్రతి మూడు నెలలకొకసారి అసైన్‌మెంట్ కమిటీని సమావేశ పరచి భూపంపిణీ సక్రమంగా జరిగేలా చూస్తామన్నారు. గ్రామాల్లో మంచినీటి సమస్యను పరిష్కరించేందుకు మండలానికి ఐదు లక్షల రూపాయలను తన సొంత నిధుల నుంచి ఇవ్వనున్నట్లు ప్రకటించారు. ప్రజలకు సేవ చేసేందుకే రాజకీయాలలోకి వచ్చానని, ఏ చిన్న సమస్య వచ్చినా నేరుగా తనను కలవచ్చన్నారు. అందరికి అందుబాటులో వుండేందుకు వ్యాపారాలను సైతం ప్రక్కనబెట్టి పూర్తికాలం రాజకీయాలలో వుంటున్నానన్నారు. పార్టీని బలోపేతం చేసేందుకు ప్రతి కార్యకర్త కృషి చేయాలని పిలుపునిచ్చారు. నియోజకవర్గం లోని ప్రతి మండలంలో పార్టీ కార్యాలయాన్ని, ఐదుగురు సభ్యులతో కమిటీని ఏర్పాటుచేసి ప్రజల సమస్యలను ఎప్పటికప్పుడు గుర్తించి వాటి పరిష్కారానికి తగినచర్యలు చేపట్టనున్నట్లు వెల్లడించారు. తెలుగు మహిళానేత నువ్వుల మంజుల మాట్లాడుతూ ప్రభుత్వ వైఫల్యాలను ప్రజల దృష్టికి తీసుకొనిపోవాలని సూచించారు.

## మైపాడులో పర్యాటకుల సందడి

ఒకవైపు విద్యుత్‌కోత, మరోవైపు ఉక్కపోతతో జనం అల్లాడిపోతున్నారు. దీని నుంచి బయటపడేందుకు ప్రజలు సముద్రతీరానికి తరలివస్తుండడంతో మైపాడు తీరంలో పర్యాటకుల సందడి నెలకొనింది. రోజురోజుకు వేసవి తీవ్రత అధికమవుతుండడంతో పలు ప్రాంతాల నుంచి ప్రజలు సముద్రం వద్దకు వచ్చి సేద తీరుతున్నారు. సముద్రస్నానం చేస్తూ వేసవి తాపాన్నించి బయటపడుతున్నారు. కుటుంబ సభ్యులతో కలసి సముద్రానికి వచ్చి ఆటపాటలతో కాలక్షేపం చేసిన తర్వాత చాముండేశ్వరిదేవిని దర్శించుకొంటుండడంతో తీరంలో కోలాహలం నెలకొనింది.

## చండీయాగానికి విశేష స్పందన

తోటపల్లి గూడూరు మండలంలోని వరిగొండ పంచాయితీలో జ్వాలాముఖీ అమ్మవారికి చండీయాగం ఘనంగా జరిగింది. అమ్మవారికి పాలభిషేకంతో ప్రారంభమైన ఈ యాగంలో కుంకుమార్చన, పూలాభిషేకాలు జరిగాయి. వేదపండితులు మంగళ వాయిద్యాల నడుమ చండీయాగాన్ని నిర్వహించారు. 23, 24 తేదీలో రెండు రోజుల పాటు జరిగిన యాగం అనంతరం 25తేది పూర్ణకుంభాభిషేకం జరిపి గ్రామోత్సవం నిర్వహించారు. ఈ యాగాల్లో పాల్గొని అమ్మవారి కృషాకటాక్షాలు పొందేందుకు పలు ప్రాంతాల నుంచి భక్తులు అధికసంఖ్యలో తరలి వచ్చారు.

# ప్రజలు లేని ప్రజాపథం

## ముత్తుకూరులో స్పందన కరవు

ముత్తుకూరు మండలంలో నిర్వహించిన ప్రజాపథానికి ప్రజల నుంచి స్పందన కరువైంది. రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఈ కార్యక్రమం వలన ప్రజల సమస్యలు పరిష్కారం కాకపోవడంతో ఐదవ విడత నిర్వహించిన ప్రజాపథం మండలంలో తుస్సుమనింది. బ్రహ్మదేవం, పొట్టెంపాడు, వల్లూరు, తాళ్లపూడి గ్రామాల్లో ప్రజల నుంచి తీవ్రనిరసన వ్యక్తమయ్యింది. ఎన్నికల ముందు విచ్చలవిడిగా రేషన్‌కార్డులు, పింఛన్లు పంపిణీ చేసి ఇప్పుడు సర్వేపేరుతో పెద్దఎత్తున కార్డులు ఎలాతొలగిస్తారని ప్రజలు అధికారులను నిలదీశారు. మాకు ఇంకేమీ అక్కర లేదని రేషన్‌కార్డులు, పింఛన్లు అందిస్తే చాలన్నారు. అర్హులకు కార్డులు తొలగించడం ఎంతవరకు సమంజసమని వారు ప్రశ్నించడంతో సమాధానం చెప్పలేక అధికారులు తలలు పట్టుకున్నారు.

● ఆత్మకూరు

# మహిళా కాంగ్రెస్‌నేత దండకాలు!

### భలే నాయకురాలండీ!

ఆత్మకూరు మహిళా కాంగ్రెస్ నేతగా తనకు తానుగా ప్రచారం చేసుకొంటున్న శైలజారెడ్డి వ్యవహారంపై సర్వత్రా విమర్శలు వ్యక్తమవుతున్నాయి. ఆమె కాంగ్రెస్ కార్యక్రమాల పేరిట వేలాది రూపాయల దండకాలకు దిగుతుండడం, అందుకు సమ్మతించని వారిపై రుబాబు చేస్తుండడం మహిళా లోకానికే సిగ్గుచేటుగా మారింది. ఈమె భర్త కృష్ణారెడ్డి బట్టేపాడు గ్రామంలో మద్యం బెల్టుషాపు నిర్వహిస్తుండేవాడు. గ్రామస్తులు శైలజ – కృష్ణారెడ్డి దంపతుల వ్యవహార శైలి నచ్చక పంచాయితీ సర్పంచ్ తూమాటి ధనుంజయరెడ్డి సూచన మేరకు వీరి బెల్టుషాపును తొలగించి వేరేవారికి కేటాయించారు. గ్రామస్తులు తమ షాపును తొలగించారని కక్షకట్టిన శైలజ బెల్టు షాపులను తొలగించాలంటూ ఉద్యమం చేపట్టడంతో ఆమె పట్ల తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. కాంగ్రెస్ నాయకురాలినంటూ మంత్రి పేరు చెప్తూ వెంకట్రావుపల్లి తదితర పంచాయితీలలోని మద్యం వ్యాపారుల నుంచి వేలాది రూపాయలు దండేసిందట. పోలీస్ స్టేషన్లు, ప్రభుత్వ కార్యాలయాల్లో నిత్యం తిరుగుతూ అధికారులపైనా దురుసుగా ప్రవర్తిస్తుండడంతో జనం ఆమె పేరు చెప్తేనే ఛీ కొడుతున్నారు. ఈమె వ్యవహారశైలి మంత్రికి తలవంపులు తెచ్చేదిగా వుందని సొంత పార్టీలోని నేతలు వ్యాఖ్యానిస్తున్నారు.

## కామ్రేడ్లతో కెసిఆర్ 'వార్'



గత ఎన్నికల్లో కామ్రేడ్స్‌తో చెట్టాపట్టాలు పట్టుకొని నడిచిన కెసిఆర్‌కు ఇప్పుడు వారి పేరు చెబితేనే ఒళ్లుమండుతోంది. సిపిఎం తెలంగాణకు వ్యతిరేకమైనా సిపిఐ మాత్రం మొదటి నుంచి ప్రత్యేక తెలంగాణ మంత్రాన్ని జపిస్తోంది. అయినా ఎందుకనో కమ్యూనిస్టు సోదరులిద్దరినీ కెసిఆర్ ఒకే గాట కట్టి చెత్తచెత్తగా తిట్టిపోస్తున్నాడు. తోకపార్టీలంటూ, మూర్ఖులంటూ విమర్శిస్తున్నాడు. శ్రీకృష్ణ కమిటీకి కామ్రేడ్లు ఇచ్చిన నివేదిక కెసిఆర్‌కు నచ్చలేదట. అందుకే ఈ విమర్శలంటున్నారు టిఆర్‌ఎస్ నాయకులు. ఉపఎన్నికలు జరుగనున్న తరుణంలో వామపక్షాలతో కయ్యం పెట్టుకోవడం మంచిది కాదని సన్నిహితులు కెసిఆర్‌కు నచ్చజెబుతున్నా ఆయన వినడం లేదట. మొత్తానికి ఎరుపుకు, గులాబీలకి మధ్య ఉపఎన్నికల కంటే కాస్తంత ముందుగానే 'యుద్ధం' మొదలైంది. ఫలితం తెలుసుకోవాలనుకుంటే మాత్రం మరికొన్ని రోజులు ఆగాల్సిందే !!

## మారెప్ప 'ఘోష'



వై.ఎస్. క్యాబినెట్‌లో మంత్రిగా వున్న మారెప్ప అప్పట్లో వివాదాస్పద వ్యాఖ్యలు చేస్తూ జనానికి వినోదం కలిగించేవాడు. గత ఎన్నికల్లో ఓడిపోవడంతో ఇప్పుడు అనామకుడిగా మిగిలిపోయాడు. దీనికితోడు కర్నూలు ఎమ్మెల్యే సిఎం సామాజికవర్గానికి చెందినవాడు కావడంతో ఇప్పుడు మారెప్పకు నిద్రలేని రాత్రులు ఎదురవుతున్నాయి. కర్నూలు ఎమ్మెల్యేకు, మారెప్పకు మధ్య ఉప్పు–నిప్పు లాంటి సంబంధం వుంది. రోశయ్య సామాజికవర్గం కావడమే కాకుండా ఎంతో సన్నిహితుడైన ఆయనకు త్వరలో మంత్రియోగం పట్టడం కూడా ఖాయమనుకుంటున్నారు. ఈ పరిస్థితుల్లో జిల్లాలో ఇక తనకు దిక్కెవ్వరు? అంటూ మారెప్ప మొత్తుకుంటున్నాడు. మొదటి నుంచి వై.ఎస్ హార్డ్‌కోర్ అయినప్పటికీ మంత్రివర్గ విస్తరణలో పదవిని కోల్పోయాడు. రోశయ్య సిఎం కావడంతో ఇక మారెప్ప రాజకీయాలకు శాశ్వతంగా తెరపడినట్లేననిఅనుకుంటున్నారు. అందుకే మారెప్ప కనబడినవాళ్లతో తన 'ఘోష' వినిపిస్తున్నాడు.

## ఉపఎన్నికలపై కాంగ్రెస్ 'శషభిషలు'



తెలంగాణలో త్వరలో జరుగనున్న ఉపఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీలో శషభిషలు మొదలయ్యాయి. తెలంగాణవాదం తీవ్రంగా వున్న ఈ సమయంలో టిఆర్‌ఎస్ ఖాళీ చేసిన స్థానాల్లో పోటీ చేసి గెలవడం సునాయాసం కాదని తెలంగాణప్రాంత కాంగ్రెస్ ఎమ్మెల్యేలు వాదిస్తున్నారు. ఒకవేళ పోటీ చేసి ఓడిపోతే తెలంగాణ వాదానికి మరింత బలం వస్తుందన్నది వీరి వాదన. అందుకు ఉపఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ పోటీ చేయకుండా వుంటేనే మంచిదంటూ అధిష్టానానికి నచ్చజెప్పాలని వీరు నిర్ణయించుకున్నారు. అయితే అధిష్టానం మాత్రం ఉపఎన్నికల్లో పోటీకే మొగ్గ చూపుతోంది. ఎన్నికల బరిలో నిలిచి కొన్ని స్థానాలనైనా చేజిక్కించుకొని తెలంగాణలో కాంగ్రెస్ ఉనికిని చాటాలని అధిష్టానం భావిస్తోంది. సీమాంధ్ర కాంగ్రెస్ నేతలు కూడా అధిష్టానానికే మొగ్గ చూపుతున్నారు. మొత్తానికి ఉపఎన్నికలలో కాంగ్రెస్‌లో 'సెగ' పుట్టించడం ఖాయంగా కనిపిస్తోంది.

## రోశయ్య హెలికాప్టర్ ఎక్కాడు



హెలికాప్టర్ పేరు చెబితేనే ఆమడదూరం వుంటున్న సిఎం రోశయ్యకు నచ్చజెప్పి మొత్తానికి హెలికాప్టర్ ఎక్కించారు ఆయన భద్రతా సిబ్బంది. ప్రజాపథం కోసం రాష్ట్రవ్యాప్త పర్యటనలు చేస్తున్న రోశయ్య హెలికాప్టర్ లేకుండా చూడండి అంటూ భద్రతా సిబ్బందికి పరీక్ష పెడ్తున్నాడు. వందల మైళ్లు హెలికాప్టర్ లేకుండా ప్రయాణించడం ఆషామాషీ కాదంటూ భద్రతా సిబ్బంది రోశయ్యకు బ్రెయిన్ వాష్ చేశారట. ఇక తప్పదనుకొని హెలికాప్టర్ ఎక్కేశాడాయన. అయితే చీటికీ మాటికీ హెలికాప్టర్‌ను వాడొద్దని రోశయ్య తాకీదు ఇచ్చాడట. హెలికాప్టర్ అంటే భయపడుతున్న రోశయ్య కోసం ఎంచక్కా ఓ బుల్లి విమానాన్ని కొనాలంటూ భద్రతా సిబ్బంది చేసిన ప్రతిపాదన పట్ల విమర్శలు రావడంతో ప్రభుత్వం ఓ అడుగు వెనకేసినట్లు సమాచారం.

## డిఎస్‌కు 'అగ్నిపరీక్ష'



అధిష్టాన సీతకన్నుకు గురై విలవిలాడుతున్న కాంగ్రెస్ చీఫ్ డిఎస్‌కు ఉపఎన్నిక రూపంలో మరో అగ్ని పరీక్ష ఎదురు కానుందా! పరిస్థితుల్ని చూస్తుంటే అలానే అనిపిస్తోంది. శాసనమండలి టిక్కెట్టుపై గంపెడాశలు పెట్టుకున్నాడు డిఎస్. అయితే కె.వి.పి చక్రం తిప్పి డిఎస్ ఆశలపై నీళ్లు చల్లాడు. ఇప్పుడు గత్యంతరం లేక త్వరలో జరుగనున్న నిజామాబాద్ ఎన్నికల బరిలో నిలవక తప్పని పరిస్థితి డిఎస్‌ది. రాష్ట్రరాజకీయాల్లో వచ్చే మూడున్నరేళ్లు బతికి బట్టకట్టాలంటే ఎమ్మెల్యేగా గెలవకతప్పదు. అయితే తెలంగాణవాదం తీవ్రంగా వున్న ఈ సమయంలో నిజామాబాద్‌లో గెలవడం చిన్న విషయం కాదు. అయితే అది బిజెపి ఖాళీ చేసిన సీటు అన్న చిన్న ఆశ మాత్రం డిఎస్‌లో వుంది. అధిష్టానం తన పేరు ప్రకటించేంత వరకు ఉపఎన్నికల ఊసు ఎత్తడానికి డిఎస్ ఇష్టపడటం లేదు. చివరికి ఏమవుతుందో వేచి చూడాల్సిందే !!

## తాడోపేడో తేల్చుకుంటాడట!



రాష్ట్ర రాజకీయాల్లో తాడోపేడో తేల్చుకోవాలనుకుంటున్నాడు వై.ఎస్ తనయుడు జగన్. ఓదార్పుయాత్ర సక్సెస్ కావడంతో ఇక వెనక్కి తిరిగి చూడకూడదనుకుంటున్నాడట. వచ్చే ఎన్నికలనాటికి కాంగ్రెస్‌పార్టీని హస్తగతం చేసుకోడానికి ప్రణాళికల్ని రూపొందిస్తున్నట్లు భోగట్టా. ఇందులో భాగంగానే త్వరలో జరుగనున్న పార్టీ సంస్థాగత ఎన్నికలపై దృష్టి పెట్టాడు. సంస్థాగత ఎన్నికల్లో సొంత మనుషుల్ని గెలిపించుకొని పార్టీపై పట్టుసాధిస్తే సిఎం పదవి పెద్ద కష్టం కాబోదని అనుకుంటున్నాడట. కె.వి.పి సాయంతో ఇప్పటికే సంస్థాగత ఎన్నికల నిర్వాహకులుగా తన హార్డ్‌కోర్‌తో నింపేశాడు. వీరంతా ఎన్నికల్లో వై.ఎస్ వర్గీయులు గెలిచేలా జాగ్రత్త పడతారు. అప్పుడు ప్రతి జిల్లాలో కూడా పార్టీ నాయకత్వం తమ చేతి కిందకు వస్తుందన్నది జగన్ వ్యూహం. చూద్దాం జగన్ ఏం మాయ చేస్తాడో!

## కెవిపి హవా నడుస్తోందా?



వై.ఎస్ ఆత్మగా పేరుతెచ్చుకున్న కె.వి.పి. రామచంద్రరావు హవా ఇంకా తగ్గలేదా? రాష్ట్రంలో ఆయన ఇంకా చక్రం తిప్పుతూనే వున్నారా! అంటే అవుననే అనాల్సివస్తోంది. రోశయ్య సిఎం అయ్యాక కెవిపి గాలి తగ్గిందని అనుకున్నారు. అయితే జరుగుతున్న పరిణామాల్ని బట్టి చూస్తే మాత్రం అలా అనిపించడం లేదు. శాసనమండలి సీట్లను తన మనుషులకు ఇప్పించుకున్నాడు. త్వరలో రాష్ట్రమంత్రివర్గ విస్తరణ అంటూ వార్తలు వస్తున్న నేపథ్యంలో కె.వి.పి ఇంటికి మంత్రులు, మంత్రి పదవుల్ని ఆశిస్తున్నవారి తాకిడి ఎక్కువైంది. అలాగే 'మంచి' పోస్టింగ్‌లను ఆశిస్తున్న ఐఎఎస్ అధికారులు కూడా 'క్యూ'కడుతున్నారు. వై.ఎస్ వున్నా లేకున్నా కె.వి.పికి పెద్ద తేడా ఏం లేదని కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీ కార్యాలయంలో ఎమ్మెల్యేలు గుసగుసలాడుతున్నారు.



మాజీ పాత్రికేయుడు, ప్రస్తుతం కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి పిఏ డిపి.సారథి కుమార్తె కళ్యాణి, మహేష్‌ల పెళ్లి ఏప్రెల్ 9తేది నెల్లూరు టిటిడి కళ్యాణ మండపంలో జరిగింది.



## సర్వ విఘ్నాలు తొలగించే

# సంకటహర చతుర్థి వ్రతం!

ఏ కార్యం తలపెట్టినా, ఏ వ్రతం ఆచరించినా ముందుగా గణపతిని ఆరాధిస్తారు. విఘ్నాధిపతి అయిన వినాయకుడు సంకటాలను, సర్వవిఘ్నాలను పోగొట్టి శుభాన్ని కలుగజేస్తాడు. అలాంటి గణపతిని పలురకాలుగా పూజిస్తారు. అన్నింటిలోకి అత్యంత మహిమాన్వితమైనది, కష్టాలను తొలగించి అనంత శుభాలు కలుగుజేసేది సంకటహర చతుర్థీవ్రతం. దీనినే శ్రీసంకష్టహర చతుర్థీ మహాగణపతి వ్రతం అని కూడా అంటారు. స్కంద పురాణంలో, శ్రావణమాస మహత్యంలో వ్యాసభగవానుడు ఈ వ్రతం యొక్క విశిష్టతను తెలియపరచాడు.

ఏమి చేయాలో పాలుపోక, ఏది చేసినా విజయవంతంకాక, సందిగ్ధావస్థలో వున్న సమయంలో ఈ వ్రతం ఆచరించడం వలన సర్వవిఘ్నాలు తొలగి సుఖ సంతోషాలు కల్గుతాయి. ప్రతి మాసంలో వచ్చే కృష్ణపక్ష చతుర్థి చంద్రోదయ సమయంలో పూజించినట్లయితే శుభం కల్గుతుందని గణపతే స్వయంగా తల్లి అయిన పార్వతిదేవికి చెప్పినట్లు పురాణ కథనం.

మొదటిసారిగా ఈ వ్రతాన్ని శ్రావణ బహుళ చతుర్థి నుంచి ప్రారంభించాలి. లేని పక్షంలో ఏదో ఒక శుభమాసంలో బహుళ చతుర్థినుండైనా ప్రారంభించవచ్చు. ఈ వ్రతం చేయదలచిన వారు సూర్యోదయానికి ముందే కాలకృత్యాలు తీర్చుకొని స్నానం చేసి గణపతిని పూజించాలి. ఒక పీటను సిద్ధం చేసి దానిపై శుభ్రమైన వస్త్రం వేసి బియ్యంపోసి గంగాజలం, సుగంధ ద్రవ్యాలతో, పుష్పాలతో మామిడి ఆకులతో, టెంకాయతో కూడిన కలశాన్ని ఏర్పాటు చేయాలి. ఎర్రని వస్త్రాన్ని వుంచి గణపతి విగ్రహాన్ని పెట్టి పూజ చేయాలి. 21 ఉండ్రాళ్లను వినాయకునికి నైవేద్యంగా పెట్టాలి. పూజానంతరం చంద్ర దర్శనం చేసుకొని చంద్రునికి అర్ఘ్యం వదలాలి. అనంతరం కుటుంబసభ్యులతో కలసి తీర్థ ప్రసాదాలను స్వీకరించినట్లయితే సర్వవిధ సంకటాలు తొలగి శుభాలు కలుగుతాయని ప్రతీతి.



## ట్రంకు రోడ్డు

### వేషాలలో సారమింతేనయా...!




ప్రజాపథం సభల్లో ప్రజలు వివిధ సమస్యల మీద తనను నిలదీయకుండా వుండను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి తెలివైన ఎత్తుగడ వేశారు. అదేమిటో కాదు వేషాలు మార్చడం. నగరంలో జరిగిన ప్రజాపథం సభల్లో ఇప్పటివరకు ఆయన 30కిపైగా చిత్రవిచిత్ర వేషాలు వేశారు. కర్నూల్‌లో ఇటువంటి వేషగాడైన మరోనేత బంగి అనంతయ్యను సైతం మించిపోయారు. జనం ఈ వింత వేషాలు చూస్తూ దంగైపోతుండగా ఆయన వడివడిగా వీధుల్లో నడుస్తూ ప్రజాపథం కార్యక్రమం అయ్యిందనిపిస్తున్నారు. అక్కడక్కడా ఎదురైన గట్టి నిరసనను పోలీసుల సహకారంతో అధిగమించారాయన. ఈ పద్ధతే తనను రాజకీయంగా గట్టెక్కిస్తుందన్న గట్టి నమ్మకంతో ముందుకు సాగిపోతున్నారాయన.

### మీడియా X మీడియా




మీడియా మధ్య పోటీలతో వారికి సంబంధించిన లోగుట్టు సైతం ప్రజలు బాగా తెలుసుకోగలుగుతున్నారు. సూర్యపత్రిక అధినేత, పెనుగొండ కాళేశ్వరస్వామి మధ్య జరిగిందని చెబుతున్న భారీ ఒప్పందాన్ని 'ఆంధ్రజ్యోతి' పత్రిక బయట వేయడంతో విస్తుపోవడం ప్రజల వంతయ్యింది. తమను ఆంధ్రజ్యోతి పత్రిక గబ్బు పట్టిస్తుందంటూ సూర్యపత్రికలోని పాత్రికేయులు 23తేది నెల్లూరు గాంధీబొమ్మ వద్ద రాస్తారోకో చేశారు. మంచి ఎండలో ప్రజల వాహనాలు ఆపడంతో ఈ మీడియా మధ్య గొడవలు తెలియని సామాన్యజనం 'సూర్య' విలేకరులను తిట్టిపోశారు. ప్రజల సానుభూతి కోసం చేసిన ఈ కార్యక్రమమిలా కావడంతో పాపమా విలేకరులు హతాశులయ్యారు.

### ఆనం, బొమ్మిరెడ్డి భాయి భాయి!



రాజకీయాల్లో శాశ్వత శత్రువులు, మిత్రులు వుండరని లోకానికి మరోసారి చాటి చెప్పారు మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, శాసనమండలి సభ్యుడు బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి. గతంలో ఆనం కుటుంబీకులకు బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి తండ్రి డాక్టర్ సుందరామిరెడ్డి వీరభక్త హనుమాన్. దీనివల్లే డాక్టర్‌గారు 1978, 1985, 1989 సంవత్సరాల్లో ఆత్మకూరు ఎమ్మెల్యేగా పని చేయగలిగారు. 2004 ఎన్నికల్లో బొల్లినేని కృష్ణయ్యకు ఆనం కుటుంబీకులు టిక్కెట్ ఇప్పించారని డాక్టర్ గారు వారికి దూరమయ్యారు. ఈ కసితోనే రాఘవేంద్రరెడ్డి స్వతంత్ర ఎమ్మెల్సీగా బాగా ఖర్చుపెట్టి మొన్నటి ఎన్నికల్లో గెల్చారు. ఆ తర్వాత ప్రజారాజ్యంలోకి అటునుంచి మళ్లీ వైఎస్‌కు దగ్గరయ్యారు. ఇటీవలవరకు ఆత్మకూరు రాజకీయాల్లో ఆనం రామనారాయణరెడ్డిని వ్యతిరేకించిన రాఘవేంద్రరెడ్డి 'ప్రజాపథం' సభల్లో మంత్రిని కీర్తిస్తూ ఈ సభలో పాల్గొనడం చూసిన నియోజకవర్గ ప్రజలు విస్తుపోయారు. రాజకీయమా...మజాకానా?

### బాగుంది వరుస!




గతంలో బంగారు వ్యాపారస్తులంటే నమ్మకానికి మారుపేరుగా వుండేవారు. కాలానుగుణంగా వారిలోనూ మార్పు వచ్చేసింది. మార్కెట్‌లో కాస్త పనోళ్లుగా గుర్తింపు పొందిన వెంటనే కోటీశ్వరులుగాను అడ్డదారులు తొక్కుతున్నారు. నమ్మకం మీద తమకు పనులిచ్చిన 'సేట్'లను నిలువునా ముంచను ప్రయత్నిస్తున్నారు. జరగని దొంగతనాలు జరిగినట్లు పోలీసులకు ఫిర్యాదులిచ్చి వారిని ఏమార్చే ప్రయత్నంలో కాలం కలసిరాక పోలీసులకు దొరికిపోతున్నారు. నెల్లూరు కుమ్మరవీధికి చెందిన ఖాదర్‌మొహియుద్దీన్ కొరడావీధిలో బంగారు పని చేసేవాడు. చెన్నైలోని లలితా జ్యూవెల్స్ వారు ఇతనికి బంగారిచ్చి ఆభరణాలు చేయించుకొనేవారు. వారిచ్చిన కిలోకిపైగా బంగారం దొంగలు దోచుకొన్నారని గతవారం ఓ సీన్ క్రియేట్ చేశాడు. కాని పోలీసులు లోతు దర్యాప్తులో ఫిర్యాదు చేసిన ఖాదర్ మొహియుద్దీన్‌నే అసలు దొంగగా దొరికిపోయాడు. నెల్లూరు బంగారు వ్యాపారస్తులలో కొందరు దొంగతనాలు జరగకపోయినా జరిగినట్లు ఆడుతున్న నాటకం 'నాయనాపులి' కథను స్ఫురణకు తెస్తుంది.

# వారఫలాలు

*తేది 1-05-2010 నుండి 7-05-2010 వరకు మేషంలో రవి, బుధులు; వృషభంలో శుక్రుడు; కుంభ, మీనాల్లో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; మిథునంలో కేతువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాల్లో చంద్రుడు సంచరిస్తారు.*




పొత్తికడుపునకు సంబంధించి ఇబ్బంది ఉండవచ్చు. దూర ప్రయాణాలు మానుకోవాలి. కళత్ర ఆరోగ్యం జాగ్రత్త. వృత్తిలో మార్పు చేర్పులు. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది. దూరవార్తా శ్రవణం ప్రయోజనకారి. వ్యాపారులకు కొంతవరకు మేలు. ఊహలు తారుమారు అవుతాయి. అనుకొన్నవి జరుగకపోవచ్చు. మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త. అలసట శ్రమ ఉంటుంది.




దైవచింతనలో మనసు పోనివ్వాలి. ప్రతిపని దీర్ఘంగా ఆలోచించి చేయాలి. నష్టావకాశాలు. అనవసరపు ఖర్చులు. ముందు చూపు అవసరం. అనారోగ్య బాధలుంటాయి. సమ సమాజంలో గౌరవం, మన్నన, మర్యాదలు పెరుగుతాయి. తోటివారు మన స్ఫూర్తిగా మీ పనులలో సాయమందిస్తారు. సంతానానికి సంబంధించి అతిశ్రద్ధతో ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొంటారు.




వారసత్వ ఆస్తులకు సంబంధించిన ఇబ్బందులు తొలగుతాయి. భవిష్యదాదాయాలను ఊహించి ఖర్చులు చేస్తారు. అభిప్రాయ భేదాలు తొలగి కళత్ర సంబంధాలు మెరుగుపడతాయి. వృత్తిలో మార్పు చేర్పులు. ఆర్థికలావాదేవీలు సరియైన రీతిలో నిర్వహిస్తారు. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది. దూరవార్తా శ్రవణం ప్రయోజనకారి. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు.




చేతికందిందంతా పూర్తిగా ఖర్చు చేస్తారు. ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకొని ఇబ్బందులు కొని తెచ్చుకోవద్దు. కళత్ర సంబంధం కొంతవరకు మెరుగు. వాహనాలు నడిపే సమయంలో అతిజాగ్రత్త అవసరం. ఆర్థికవ్యవహారాల్లో తొందరపాటు వల్ల నష్టపోతారు. నిర్విఘ్నంగా పనులు జరగడానికి దైవప్రార్థన చేయండి. బంధువుల కారణంగా చికాకు ఉండవచ్చు.




పిల్లలకోసం విలువైన వస్తువులు కొంటారు. ప్రేమ విషయాలు ఫలిస్తాయి. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి. మృదు భాషణతో పనులు సాధించుకొంటారు. సంతానమూలంగా లాభాలు. శుభవార్తాశ్రవణం. ఉద్యోగంలో నూతన బాధ్యతలు అధికం. విసుగును తెప్పిస్తాయి జాగ్రత్త. గృహిణులకు బంధువులరాక విశ్రాంతి రాహిత్యాన్నిస్తుంది.




ఆరోగ్యవిషయాలు చక్కగా ఉంటాయి. ఆప్తమిత్రుల తోడ్పాటు లభిస్తుంది. సమాజంలో గౌరవ మర్యాదలు ఇనుమడిస్తాయి. ఎన్ని నాళ్ళుగానో ఎదురు చూచిన ప్రియవార్తా శ్రవణం చేస్తారు. ఇరుగు పొరుగువారితో సంబంధాలు చక్కగా ఉంటాయి. ఇతరులతో అభిప్రాయభేదాలు కొంతవరకు తొలగుతాయి. ఆదాయం వున్నా ఖర్చులు అధికం. ఆదాయమార్గాలలో ఆటంకాలు తొలగిపోతాయి.




వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి ఉంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖతవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. మాతృసుఖం లభిస్తుంది. రియల్ ఎస్టేట్ వ్యవహారాలు ఒకమోస్తరుగా ఊపందుకొంటాయి. గృహసంబంధమైన వస్తువులు కొంటారు. కళత్ర సుఖం బాగుంటుంది. వ్రతాలు, పూజలు మొదలైన వాటిలో పాల్గొంటారు.




అనుకొన్నవన్నీ సాగించుకొంటారు. కుటుంబసభ్యుల అవసరాలను గుర్తించి వారికి అందేట్లు చేస్తారు. బ్యాంకు నిల్వలు పెంచే పథకాలు తయారు చేస్తారు. వృత్తిరీత్యా మంచి అభివృద్ధి ఉంటుంది. సంతానమూలంగా తృప్తి లభిస్తుంది. బంధుమిత్రులను, గురుతుల్యులను కలుసుకొంటారు. శుభకార్యాలలో మీ పాత్ర చక్కగా నిర్వహిస్తారు. ఆదాయం తృప్తికరంగా ఉంటుంది.




ఆర్థికవిషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. కొత్త ఆలోచనలు తోస్తాయి. పూనుకొన్న పనుల్ని పూర్తి జేయడంలో కొంత శ్రమ నెదుర్కోవలసి వస్తుంది. బంధుమిత్రులలో కొందరు ధనసహాయం కోరివస్తారు. తొందరపాటు వద్దు. వ్యాపారులు పెట్టుబడులపై ముఖ్య నిర్ణయం తీసుకొంటారు. ఉద్యోగులకు పై అధికారుల వైఖరివల్ల మనశ్శాంతి లోపిస్తుంది.




నూతన వ్యక్తుల పరిచయాలు ఏర్పడతాయి. జనసంబంధాలు మెరుగుపడతాయి. వేడుకలు శుభకార్యాల్లో పాల్గొంటారు. ప్రయాణాలు, చర్చల విషయంలో కొంత మెలకువగా ఉండాలి. పితృసంబంధీకుల నుండి మంచి వార్త వింటారు. ధనవిషయాలలో లోటు లేదు. వివిధమార్గాలలో ధనప్రాప్తి అవకాశాలు. ఇతరులతో అభిప్రాయభేదాలు రావచ్చు. శుభకార్యాచరణకు శ్రీకారం చుడతారు.




ఆహారవిషయంలో శ్రద్ధలేకుంటే అనారోగ్యపరిస్థితులు ఆందోళననిస్తాయి. ఎదురుచూచిన వారిని కలుసుకొంటారు. ఊహించని ప్రయాణాలు ఇబ్బందికరమవుతాయి. ముక్కుసూటిగా పోవడం, అసహనం, కోపావేశాలు మానుకోవాలి. ప్రతిపనిలో నిదానం అవసరం. అప్పుడే మనశ్శాంతి లభిస్తుంది. ఆంత్ర బాధలుండవచ్చు. ధనవిషయంలో లోపం ఉండదు.




వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సాహిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. బంధువుల నడుమ మన్ననల ప్రాప్తికి అవకాశాలు. సంతానానికి సంబంధించిన విషయాల్లో అతిశ్రద్ధ, ముఖ్యమైన నిర్ణయాలు తీసుకొంటారు. దైవపూజా కార్యక్రమాలలో పాలుపంచుకొంటారు. బంధుమిత్రుల మూలంగా కష్టనష్టాలెక్కువ.

## పంచాంగం

**సాధారణ ముహూర్తాలు**

2, 5, 7 తేదీల్లో ఉ.6.45గం.ల నుండి 7.45ల వరకు వృషభ లగ్నాన సుముహూర్తాలున్నాయి.

**ఏప్రెల్ తిథులు**

**అధిక వైశాఖ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | శని | తదియ | మ.2.08 | గం.ల.వ |
| 2 | ఆది | చవితి | మ.2.08 | గం.ల.వ |
| 3 | సోమ | పంచమి | సా.4.18 | గం.ల.వ |
| 4 | మంగళ | షష్ఠి | సా.6.06 | గం.ల.వ |
| 5 | బుధ | సప్తమి | రా.8.22 | గం.ల.వ |
| 6 | గురు | అష్టమి | రా.10.51 | గం.ల.వ |
| 7 | శుక్ర | నవమి | రా.1.19 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# దర్గాలకు ఉత్తరం ఇళ్లు కట్టకూడదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*సూరంపూడి విమల — గూడూరు*

* *అనారోగ్యాలు, సమస్యలు ఎక్కువ. వాస్తు దోషాల్ని సరిచేసుకొనే ఆర్థిక పరిస్థితి లేదు. పరిష్కారం చెప్పండి?*

ప్లాను, ఉత్తరం చూశాను. శిథిల గృహం దగ్గర నివాసం దుష్టశక్తుల ప్రభావానికి ఆస్కారం. ప్లానులో చాలా లోపాలున్నాయి. వెంటనే వాస్తు యంత్రం (ప్రథమార్గం) ప్రతిష్టించుకోండి.

*వి.ప్రవీణ్‌శేఖర్ — హైదరాబాద్*

* *దర్గాకు ఉత్తరం వైపు యిల్లు కట్టాక చాలా బాగా వుండేది. ఈ మధ్య లేనిపోని విపత్కర పరిస్థితులు ఎదురౌతున్నాయి?*

దర్గాకు ఉత్తరపు ఇంట్లో ఆకస్మిక ప్రమాదాలుంటాయి. శక్తి యంత్రప్రతిష్ట లేకపోతే మతిస్థిమితం కోల్పోవడం కూడా జరుగుతుంది.

*డి.అనుజరెడ్డి — బెంగుళూరు*

* *సింహద్వార ప్రతిష్ట సమయంలో కూడా పూజ నిర్వహించాలా?*

ద్వార ప్రతిష్ట, శ్లాబు, గృహం పూర్తి స్థాయిలలో పూజా కార్యక్రమాల్ని నిర్వహించాలి. అలా చేయడానికి ముందు యజమాని, భార్యపేర గణాంకాలలో వచ్చే యంత్రప్రతిష్ట చేయాలి. అపార్టుమెంట్ల నిర్మాణంలో కూడా ఇలా జరగాలి. లేకపోతే యజమాని నష్టపోతాడు.

*త్రిపురనేని భువన — విజయవాడ*

* *ఈశాన్యం వీధి చూపు మంచిదంటారు కదా? మీరేమంటారు?*

వశిష్ట వాస్తు ప్రకారం మొత్తం స్థలానికి చివర్లో 'వీధిచూపు' తాకాలి. అంటే పదిశాతమన్న మాట. ఆపై ఎంత తాకినా దృష్టి దోషమవుతుంది. వీధి పోట్ల యితే దృష్టి దోషంతోబాటు 'వేధ' తోడవుతుంది.

*మిన్నపు ఉష — నెల్లూరు*

* *ఈశాన్యంలో అంతరమెట్లున్నాయి. ఈశాన్య అగాధం మంచిదేకదా?*

అంతర్మెట్లు, స్తంభం ఈశాన్యంలో దారిద్ర్యం కలుగజేస్తాయి. పశ్చిమం ఇంటికి అంతర్మెట్లు స్తంభంతో కూడి నైరుతిలో కూడా రాకూడదు. పుత్రులు భ్రష్టులవుతారు.

*డాక్టర్ అవినాష్ — తిరుపతి*

* *చంద్రగిరి కోట వాస్తు ప్రకారం సరైనదేనా?*

తూర్పు, పశ్చిమ ప్రవేశ ద్వారాలు సరైనవే. ఉత్తరం రాజమహలు, పశ్చిమ వాయువ్యం కొలను, ఉత్తరం దిశా అంతఃపురంలలో చాలా వాస్తు దోషాలున్నాయి. అందువల్లే చంద్రగిరి చరిత్ర అస్తవ్యస్తం.

*వరహాలు బంగారు — తిరుపతి*

* *ఇంట్లో అవాస్తు దోషాలు పుష్కలంగా వున్నాయి. అయినా మేం బాగానే వున్నాము.*

మీరు శుక్ర దశ పయనంలో వున్నారు. అక్టోబరు 14–2014కి ఆ దశ ముగుస్తుంది. అవాస్తు ప్రభావాలు ఆ రోజు నుంచి మీపై దాడి చేస్తాయి.

*పి.ఆర్.కె — ఒంగోలు*

* *అధికారి వత్తిడికి గురిచేస్తున్నాడు. రాజీనామాచేసే యోచనలో వున్నాను.*

అవసరం లేదు. ముత్యం(శ్రేష్ఠ), నీలం (విలోమ) కుడి చిటికెన, ఉంగరం వ్రేళ్లకు ధరించండి. మేలు జరుగుతుంది.

*బి.సత్యనారాయణరావు — నెల్లూరు*

* *స్పిన్నింగ్ మిల్లు లేఅవుట్ అడ్డదిడ్డంగా వుంది. మా యిళ్లపై ప్రభావం వుందా?*

లే అవుట్స్, ప్లాట్లు అన్నీ అలాగే వున్నాయి. సరిచేసుకోవడం అసాధ్యం, ఆత్మరక్షణ మార్గంగా, యంత్రప్రతిష్టలు చేసుకోవడం అత్యవసరం.

*కె.ఎన్.సీతాదేవి — నాయుడుపేట*

* *పశ్చిమం ఇంటికి వాయువ్యం వంటగది పెట్టవచ్చా?*

దక్షిణం యింటికి ఆగ్నేయ ప్రవేశం గనుక వంటగదికి ప్రత్యామ్నాయం వాయువ్యం. పశ్చిమం యింటికి ఆగ్నేయంలోనే వంటగది వచ్చి తీరాలి.

# అభివృద్ధి పనుల్లో వెనుకబడ్డ సంగం!

నిధుల కొరత లేకున్నప్పటికీ అభివృద్ధి పనులు చేపట్టడంలో సంగం గ్రామ పంచాయితీ పాలకవర్గం పూర్తిగా వైఫల్యం చెందింది. పంచాయితీ పరిధిలోని ప్రజలు పలు సమస్యలతో సతమతమవుతున్నా పట్టించుకునే వారు లేకుండా పోయారు. ప్రభుత్వం నుంచి గ్రాంట్ల రూపంలో ప్రతి సంవత్సరం నిధులు విడుదలవుతున్నా వీటిని సద్వినియోగం చేసుకోలేకపోతున్నారు. మండల కేంద్రంగా వున్న సంగం మీదుగా కడప, ఆత్మకూరు, ముంబాయి ప్రాంతాలకు నిత్యం రాకపోకలు జరుగుతుంటాయి. ప్రధాన కూడలిలో రోడ్ల విస్తరణ జరగకపోవడం వల్ల నిత్యం ట్రాఫిక్ స్తంభించి పోతుంటుంది. రోడ్ల విస్తరణ చేపట్టి సిమెంటు రోడ్లను వేసి, షాపింగ్ కాంప్లెక్స్ నిర్మిస్తే పంచాయితీకి మరింత ఆదాయం సమకూరే అవకాశం వుంది. సంగం గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా ఎ.లక్ష్మీప్రసన్న ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈమె తొలుత భారతీయ జనతా పార్టీ నుంచి ఎన్నికైనప్పటికీ రాజకీయ పరిణామాల నేపథ్యంలో కాంగ్రెస్ పార్టీవైపు మొగ్గు చూపింది. సర్పంచ్‌గా మహిళ గెలుపొందినప్పటికీ మొత్తం పెత్తనం ఈమె భర్త రవి చెలాయిస్తుంటాడు.

ఈ పంచాయితీలో ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలు చాలా అధ్వాన్నంగా వున్నాయి. డ్రైనేజి కాల్వలు, అంతర్గత రోడ్లు లేక ప్రజలు ఇక్కట్లు పడుతున్నారు. త్రాగునీటి సరఫరా కొంతమేర బాగున్నా డ్రైనేజి కాల్వలు నిర్మించక పోవడం వల్ల మురికి నీరంతా వీధులలోకి చేరిపోతుంది. ఈ మురికినీటిలో దోమలు, పందులు చేరుతున్నందున ఎక్కడ అంటు వ్యాధులు వ్యాపిస్తాయోనని స్థానికులు ఆందోళన చెందుతున్నారు. ఎస్సీ కాలనీలో ఇందిరమ్మ గృహాలు నిర్మించినప్పటికీ అసంపూర్తిగానే మిగిలి అధికారుల వైఫల్యాలను ఎత్తి చూపుతున్నాయి.

కొందరు లబ్దిదారులు సొంత ఖర్చులతో నిర్మాణాలను పూర్తి చేసుకున్నా ఇప్పటివరకు నగదు చెల్లింపులు జరగలేదు. ఈ సమస్యలను విన్నవించుకునేందుకు పంచాయితీ కార్యదర్శులు అందుబాటులో వుండడం లేదు. ఈ క్రమంలో సమస్యలపై స్థానికులు వెల్లడించిన అభిప్రాయాలను ప్రక్కనిస్తున్నాం.



**డ్రైనేజి కాల్వలు నిర్మించాలి!**

డ్రైనేజి కాల్వల నిర్మాణం చేపట్టక పోవడంతో ఇళ్లలోని మురికి నీరంతా వీధులలోకి చేరుతుంది. వర్షాకాలంలో అయితే నడిచి వెళ్లేందుకు ఇబ్బందికరంగా వుంటోంది. ఇప్పటికైనా అధికారులు స్పందించి ఎస్సీ కాలనీలో డ్రైనేజి కాల్వలు నిర్మించేందుకు కృషి చేయాలి.

– ఎం.చిన్నమ్మ



**బిల్లులు చెల్లించాలి!**

ఇందిరమ్మ పథకం ద్వారా నిర్మించిన పక్కా గృహాలకు అధికారులు బిల్లులు చెల్లించక కార్యాలయం చుట్టూ త్రిప్పుకుంటున్నారు. బిల్లులొస్తాయన్న నమ్మకంతో అప్పు చేసి నిర్మాణం పూర్తిచేశాం. ఇప్పుడు బిల్లులు చెల్లించకుండా అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడం బాధాకరంగా వుంది.

– పెంచలమ్మ



**దుస్థితిలో గ్రామంలోని రోడ్డు.**



**అర్థాంతరంగా నిర్మాణాలు నిలిచిన ఇందిరమ్మ ఇళ్లు.**

అవినీతి కథ

# పావలా వడ్డీ రుణపథకంలో స్వాహాపర్వం!

> స్వయం సహాయక సంఘాల్లోని మహిళలను లక్షాధికారులను చేయను ఇందిర క్రాంతి పథంలో భాగంగా ప్రభుత్వం ప్రవేశపెట్టిన పావలావడ్డీ రుణ పథకంలో పలు అవినీతి అక్రమాలు జరుగుతున్నాయి.

జిల్లాలోని స్వయం సహాయక సంఘాల్లోని మహిళలను లక్షాధికారులను చేయాలన్న ప్రభుత్వ లక్ష్యం, సంకల్పానికి తూట్లు పడుతున్నాయి. స్వయం సహాయక సంఘాల్లోని సభ్యులకు రుణాల మంజూరులో అనేక అవినీతి, అక్రమాలు చోటు చేసుకొంటున్నాయి. జిల్లాస్థాయిలోని కొందరు అధికారులు, ఇందిర క్రాంతిపథం సిబ్బంది సహకారంతో పావలా వడ్డీ రుణాలు ప్రక్కదారి పడుతున్నాయి. నాయకురాళ్లుగా చెలామణయ్యే వారు మాత్రమే ఈ రుణాలను అన్నివిధాలుగా సద్వినియోగం చేసుకుంటున్నారు.

ఇందిర క్రాంతిపథం ద్వారా మంజూరుచేసే రుణాలు, బ్యాంకు లింకేజీ ద్వారా అందించే రుణాలు సైతం అధిక భాగం సభ్యులకు చేరడం లేదు. ఒకసారి బ్యాంకు నుంచి రుణాలు పొందిన గ్రూపులకే మళ్లీమళ్లీ రుణాలు అందుతున్నాయి. ఇలా రుణాలు అందడం వెనుక ఇందిర క్రాంతిపథం సిబ్బంది ప్రమేయం వున్నట్లు ఆరోపణలు వున్నాయి. మరికొన్ని మండలాల్లో గ్రూపు సభ్యులకు తెలియకుండానే గ్రూపు లీడర్లు బ్యాంకు లింకేజి రుణాలు పొందిన సంఘటనలు అనేకం వున్నాయి. బకాయిలు చెల్లించమని బ్యాంకు నుంచి నోటీసులు వెళ్లిన సమయంలో మాత్రమే ఇటువంటి వ్యవహారాలు బహిర్గతం అవుతున్నాయి.

జిల్లాలో 9,435 స్వయం సహాయక సంఘాలు దాదాపు 21 కోట్ల 13 లక్షల రూపాయలు బ్యాంకు లింకేజి రుణాలు బకాయిలున్నాయి. ఈ బకాయిలను వసూలు చేసుకునేందుకు బ్యాంకు అధికారులు అనేక కష్టాలు పడుతున్నారు. మొండి బకాయిలను ఎలాగైనా వసూలు చేయాలన్న లక్ష్యంతో ఇటీవల జిల్లా కలెక్టర్ దృష్టికి తీసుకెళ్లారు బ్యాంకు అధికారులు. మొండి బకాయిలు చెల్లించకుంటే కొత్తగా రుణాలు మంజూరు చేయడం కష్టమని వివరించడంతో బకాయిదారులపై రెవిన్యూ రికవరీ చట్టం ప్రయోగించమని కలెక్టర్ ఆదేశించారు. ఇందుకు ప్రత్యేకంగా ఒక తహశీల్దార్‌ను సైతం నియమించారు.

బ్యాంకు లింకేజి రుణాలతోపాటు ఇందిర క్రాంతిపథం ద్వారా నేరుగా అందించిన రుణాలు కూడా కోట్లలో బకాయిలున్నాయి. ఈ రుణాలను కొందరు సభ్యులు ప్రతినెల సక్రమంగా చెల్లిస్తున్నా గ్రూపు లీడర్లు సంఘమిత్ర బ్యాంకు ఖాతాలో జమ చేయడం లేదు. వ్యక్తిగత అవసరాలకు వినియోగించుకుంటూ ఒత్తిడి చేసిన సమయంలో మాత్రమే ఎంతో కొంత చెల్లిస్తున్నారు. ఇటువంటి వారి జాబితాను బహిర్గతం చేయడంలో కూడా అధికారులు ఉదాసీనంగా వ్యవహరిస్తున్నారు. ఇందుకూరుపేట మండలంలోని మైపాడు స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, సూళ్లూరుపేటలోని ఆంధ్ర ప్రగతి గ్రామీణ బ్యాంకు, అల్లూరులోని సిండికేటు బ్యాంకులో గ్రూపు లీడర్లు రుణాలు పొందారు.

గ్రూపు లీడర్లు రుణాలు పొందిన విషయాన్ని గుర్తించిన మిగిలినసభ్యులు ఆందోళనకు దిగినప్పటికీ వారిని శాంతింపచేయగలిగారే



**అన్ని వ్యవహారాలకు మౌనసాక్షి నెల్లూరులోని ఇందిర క్రాంతి పథం కార్యాలయం.**

తప్ప గ్రూపు లీడర్ల నుంచి రుణాలను తిరిగి జమ చేసుకోవడంలో అధికారులు పూర్తిగా వైఫల్యం చెందారు. ఈ సంఘటనలు జరిగి దాదాపు ఆరు నెలలు కావస్తున్నా ఇప్పటివరకు ఎటువంటి ప్రగతి కనిపించడం లేదు. దీంతో ఈ బ్యాంకులు మిగిలిన స్వయం సహాయక సంఘ సభ్యులకు రుణాలు మంజూరు చేసేందుకు ముందుకు రావడం లేదు. కొందరు గ్రూపు లీడర్లు అవినీతి, అక్రమాలకు పాల్పడిన కారణంగా ఇతరులకు శాపంగా పరిణమించాయి.

గ్రూపు ఏర్పాటుచేసిన ఆరు నెలల కాలపరిమితిలో యాభైవేల రూపాయలను పావలా వడ్డీ రుణంగా బ్యాంకులు అందిస్తున్నాయి. తొలిసారిగా అందించిన యాభైవేల రూపాయలను నిర్ణీత సమయంలో చెల్లించిన గ్రూపులకు తిరిగి లక్ష రూపాయల నుంచి రెండు లక్షల రూపాయల వరకు బ్యాంకులు అందించే అవకాశం వుంది. ఇందిర క్రాంతి పథం సిబ్బంది, గ్రూపు లీడర్ల పనితీరు కారణంగా పావలా వడ్డీ పథకం నిర్వీర్యమై పోతుంది.





## చిత్ర సమీక్ష
## బోర్ డార్లింగ్!

✍ అల్లూరు రహీం

తొలిప్రేమ, ఉల్లాసంగా... ఉత్సాహంగా వంటి విజయవంతమైన ప్రేమకథా చిత్రాలు తీసిన దర్శకునిగా ఎ.కరుణాకరన్‌కు ప్రత్యేక గుర్తింపు వుంది. ఆయనను దర్శకునిగా పెట్టి వెంకటేశ్వర సినీచిత్ర పతాకంపై బివిఎస్ఎన్.ప్రసాద్, ప్రభాస్‌ను హీరోను చేసి తీయించిన 'డార్లింగ్' చిత్రం మాత్రం పరమబోరుగా వుంది. కథలో ప్రేక్షకులు ఊహించని మలుపులుంటే ఆ చిత్రం ఆకర్షిస్తుంది. కాని డార్లింగ్ చిత్రంలో అసలు విషయం తెలుసుకోను ప్రేక్షకులు చివరి సన్నివేశం వరకు వేచి చూడాలి. అప్పటివరకు చిత్రాన్ని చూడను చెప్పుకోతగ్గ విషయముందంటే... అదీ లేదు. కాజల్ వంటి అందమైన హీరోయిన్, యంగ్ రెబల్‌స్టార్ ప్రభాస్ వంటి హీరోను పెట్టుకొని నత్తనడకన డార్లింగ్ కథ నడిపిన ఘనత స్క్రీన్‌ప్లే కూడా వ్రాసుకొన్న కరుణాకర్‌కే దక్కింది. ప్రథమార్థంలో జరిగే చిత్రకథంతా కాల్పనికతతో నిండింది. ద్వితీయార్థంలోనైనా కథను దర్శకుడు చూడచక్కగా నడిపాడంటే అదీ లేదు. ఈ చిత్రంలో చెప్పుకోవాల్సింది కెమెరామెన్ ఆండ్రూ పనితనం. ఆయన స్విట్జర్లాండ్, అరకు అందాలను వర్ణించలేనంత గొప్పగా వెండితెరపై ఆవిష్కరించాడు. యువ సంగీత దర్శకుడు జి.వి.ప్రకాష్‌కుమార్ బాణీలు కట్టిన నీవే, ఓ సాహోరే, ఇంకా ఏదో చరణాలతో సాగే పాటలు వినసొంపుగా వున్నాయి. కాని పాటల చిత్రీకరణే దర్శకుడు దరిద్రంగా చేశాడు. ప్రేమకథా చిత్రాల్లో మనసును తాకే మాటలుంటాయి. కాని డార్లింగ్‌లో అటువంటిది ఒక్కమాటలేదు. ఇంకా ఏదో చరణంతో సాగే పాటలో గ్రాఫిక్స్‌లో గోల్కొండ, హుస్సేన్‌సాగర్‌లోని బుద్ధవిగ్రహాన్ని మంచుతో నింపిన తీరు బాగుంది. హిట్‌కోసం పరితపిస్తున్న హీరో ప్రభాస్‌కు తీవ్ర నిరాశ, నిస్పృహ మిగిల్చిన చిత్రంగా డార్లింగ్‌ను చెప్పుకోవచ్చు.

చిత్రకథలోనికి వెళ్తే 1980 దశకంలో కాలేజిలో చదువుకొన్న మిత్రులు హనుమంతరావు (ప్రభు), బుచ్చయ్య (ధర్మవరపు సుబ్రహ్మణ్యం), విశ్వనాథం (ఆహుతి ప్రసాద్), అప్పలనాయుడు (ఎం.ఎస్.నారాయణ), భద్రం (చంద్రమోహన్)లు కాలగమనంలో వివిధచోట్ల స్థిరపడినా కొన్నేళ్లకొకసారి కుటుంబాలతో సహా ఓచోటకు వచ్చి కలుస్తుంటారు. ఈ సందర్భంగా మిత్రులు చేసే అల్లరికి హద్దు వుండదు. హనుమంతరావు కుమారుడు ప్రభాస్ (ప్రభాస్), విశ్వనాథం కుమార్తె నందిని (కాజల్) చిన్నప్పుడు కలసి నృత్యం చేస్తారు. అప్పటి నుంచి ఒకరంటే మరొకరికి చెప్పలేనంత అభిమానం. కాని దాన్ని వెల్లడిచేసుకోరు. కాలేజిలో చదువుకొంటుండే ప్రభాస్‌ను క్లాస్‌మీట్ నిషా (శ్రద్ధాదాస్) ప్రేమించానంటుంది. అతను కాదనేసరికి ఆమె ఆత్మహత్యాయత్నం చేస్తుంది. ఆమె తండ్రి ముఖేష్‌రుషి పెద్ద రౌడీ. అతను ప్రభాస్‌ను పిలిచి తన కుమార్తెను పెళ్లిచేసుకోమని చెప్పగా స్విట్జర్లాండ్‌కు తాను మ్యూజిక్ ట్రూప్‌తో సహా వెళ్లినప్పుడు నందిని అనే యువతితో ప్రేమ పుట్టిందని ఆమె ఓ యాక్సిడెంట్‌లో గాయపడి కోమాలో వుందని అబద్ధం చెబుతాడు. ఇంతలో 1980 దశకం మిత్రులు అరకులో వుండే భద్రం ఇంటికి వస్తారు. ఇక్కడ ప్రభాస్, నందినిలు కలుసుకొన్నా ఒకరిపట్ల ఒకరు ప్రేమను వెల్లడిచేసుకోరు. శత్రువుల మాదిరి ప్రవర్తిస్తుంటారు. ఇంతలో అప్పలనాయుడు కుమారుడంటూ రుషి దిగుతాడు. అతను నందినిని ఆకర్షించే ప్రయత్నాలు చేస్తుంటాడు. రుషి విశ్వనాధం చెల్లెలికొడుకని హనుమంతరావుకు తెలుసు. కాని విశ్వనాధం ప్రేమపెళ్లితో విడిపోయిన ఆ కుటుంబాలను కలిపే ప్రయత్నం చేస్తూ కొడుకు ప్రేమకే అడ్డంకిగా నిలుస్తాడు. రుషిని నందిని అసహ్యించుకోవడంతో అతను ముఖేష్ రుషిని కలసి ప్రభాస్‌ను గూర్చిన అన్నీ విషయాలు చెప్తాడు. ప్రభాస్‌పై ముఖేష్‌రుషి దాడికి దిగగా నందిని వచ్చి అతన్ని హత్తుకుంటుంది. ముఖేష్‌రుషి మనసు కరగడంతో ప్రభాస్ డార్లింగ్ అతని సొంతమవుతుంది.

హీరో ప్రభాస్ బుజ్జిగాడు మేడిన్ చెన్నై చిత్రం తరహాలోనే డార్లింగ్‌లోనూ నటించాడు. మగధీరతో ఎంతో అందంగా కనిపించే కాజల్ ఈ చిత్రంలో కాస్త డల్‌గా కనిపిస్తుంది. శ్రద్ధాదాస్ పాత్ర పెద్దగా లేదు. ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ఎం.ఎస్.నారాయణ, ఆహుతి ప్రసాద్, చంద్రమోహన్, శ్రీనివాస్‌రెడ్డి, తులసిలకు చిత్రంలో పెద్ద పాత్రలుండినా ప్రయోజనం లేదు. తమిళనటుడు ప్రభు పాత్రను హాస్యనటుని పాత్రలా దర్శకుడు మలిచి గబ్బుపట్టించాడు. J

## డిమాండ్‌ను బట్టి ముద్దు



వరుడు సినిమా విడుదలకు ముందు హీరోయిన్ ఎవరా అని ఊరించిన భామ భానుశ్రీ మెహ్రా. అమృత్‌సర్‌కు చెందిన ఆమె ఇటీవల హైదరాబాద్ వచ్చిన సందర్భంగా పిచ్చాపాటీగా మాట్లాడింది. వరుడు సినిమాలో వధువుగా నేను పోషించిన పాత్ర నాకు చాలా బాగా నచ్చింది. గ్లామర్ అంటే చాలా రకాలుగా చెప్పుకోవచ్చు. అయితే అంగాంగ ప్రదర్శన అంటే నాకు ఇష్టం వుండదు. నేను నటించిన చిత్రాలను మా అమ్మ, నాన్నలు కూడా చూడగలిగేలా వుండాలి. కేవలం ఎక్స్‌పోజింగ్‌పై ఆధారపడ్డ పాత్రలను చేయడం నాకు అస్సలు ఇష్టం ఉండదు. అయితే పాత్రలు, సందర్భం కోరితే అలాంటి సన్నివేశాల్లో నటించక తప్పదు. వరుడు సినిమా చూస్తే... ఆ సీన్‌లో ప్రత్యేకంగా ముద్దును ఇరికించినట్లు ఏమాత్రం అనిపించదు. నిజంగా ఆ సన్నివేశం ముద్దును డిమాండ్ చేసింది. అటువంటి సన్నివేశాల్లో నటించడం ఏమాత్రం ఇబ్బందిగా అనిపించదదంది భానుశ్రీ మెహ్రా.

---

## గ్లామర్‌ను గాసిప్‌ను విడదీయలేం



జీవితంలో మనకున్న పరిసరాలను అనువుగా మలచుకొని ఎదగాలంటుంది గ్లామర్ హీరోయిన్ త్రిష. బాలీవుడ్‌లో అడుగుపెట్టగానే మాటలు మారినట్లున్నాయే అంటే... సమాధానంగా పరిసరాలు ప్రశాంతంగా వున్నప్పుడు నా గూర్చి నేను ఆలోచించుకొంటే ఇవన్నీ మెదలుతున్నాయి. నా కెరీర్ ప్రారంభంలో ఎన్నెన్నో ఒడిదుడుకులు ఎదుర్కొన్నాను. కానీ భగవంతుడు నాకు విజయతీరాలను చేరడానికి సుగమమైన మార్గాన్నే ప్రసాదించాడు. నేను కూడా వేసిన ప్రతి అడుగునూ ఆచితూచి వేశాను. ఫలితం నా చేతిలో లేకపోవచ్చు. నటిగా పయనిస్తూ బాలీవుడ్ తీరానికి చేరాను. ఇక్కడ కూడా కొన్ని పరీక్షలు వ్రాయాలంది. బాలీవుడ్‌లో రోజుకో గాసిప్ వినాల్సి వుంటుందేమో కదా అంటే పరిశ్రమలో గ్లామర్‌ను, గాసిప్‌ను విడదీయడానికి ప్రయత్నిస్తే బుర్ర వేడెక్కుతుందని ఆరిందలా మాట్లాడింది త్రిష.

## కాజల్ సోదరి రెడీ!



మగధీర తర్వాత హీరోయిన్ కాజల్‌కు అరడజనుకు పైగా చిత్రాల్లో నటించే అవకాశం వచ్చింది. ఆమె నటించిన డార్లింగ్ చిత్రం ఈవారంలో విడుదలయ్యింది. కాజల్ తన సోదరి నిషా అగర్వాల్‌ను హీరోయిన్‌ను చేయాలనుకొంటుంది. ఆమెతో కలసి నిషా అగర్వాల్ సినిమా వేడుకలకు హాజరవుతుంది. నిషాను చూసిన దర్శక, నిర్మాతలు ఆమెకు అవకాశాలిస్తామని ముందుకొస్తున్నారు. సినిమా వేడుకలకు చిట్టి పొట్టి మిడ్డీల్లో హాజరై అందరినీ ఆకట్టుకొన్న నిషాకు ఓ తమిళ చిత్రంలో అవకాశం వచ్చింది. అందాల ఆరబోత పట్ల పెద్దగా అభ్యంతరాలు లేవంది నిషా.

## ఇడ్లీకి నమిత పేరు



సాంబార్ ఇడ్లీ అంటే తమిళ సోదరులకు మక్కువ జాస్తి. అదేవిధంగా తమకు నచ్చిన హీరోయిన్‌లకు గుడులు కట్టుకొని పూజించడం కూడా వారికే చెల్లింది. నటి ఖుష్బూకు గుడి కట్టారు. ఆతర్వాత పెళ్లికి ముందు సెక్స్ తప్పుకాదన్న వ్యాఖ్యలను నిరసిస్తూ ఆమె పేర కట్టిన గుడిని కూలగొట్టారు. ఖుష్బూ మాదిరి తమిళ సోదరుల అభిమానాన్ని పొందిన బొద్దుగుమ్మ నమిత పేరిట చెన్నైలో గుడికట్టడానికి ఈ అమ్మడి అభిమానులు పునాదులు వేశారు. పనిలోపనిగా తమకు ఇష్టమైన ఇడ్లీకి కూడా ఈ మధ్య నమిత పేరును తగిలించి ప్రచారం చేస్తున్నారు. మామూలుకన్నా కాసింత పెద్ద సైజులలో కనిపించే ఇడ్లీలను నమిత ఇడ్లీలుగా వర్ణిస్తున్నారు. ఈ విషయమై నమిత మాట్లాడుతూ నన్ను అభిమానులు ఎలా వుండమని కోరితే అలా వుంటాను. వాళ్లకు నేను సన్నబడితే నచ్చడం లేదు. అందుకే మళ్లీ బొద్దుగా తయారయ్యానంటుంది.

---

## గాడిలో పడ్డ అసిన్



బాలీవుడ్‌లో అసిన్ పని అయిపోయిందని అందరూ అన్నారు. దీనికి తగ్గట్టే తమిళ హీరో విజయ్ సరసన ఓ చిత్రంలో ఆమె నటించింది. ఇంతలో బాలీవుడ్‌లో మరో రెండు సినిమాలు ఆమెకు దక్కాయి. ఒకటి జాన్ అబ్రహాంతోనూ, మరొకటి రణబీర్‌కపూర్‌తోను. ఈ రెండు సినిమాలు తన జాతకాన్ని తప్పక మారుస్తాయంటుంది. గతంలోలా కాకుండా నిర్మాతలందరికీ ఇక నుంచి అందుబాటులో వుంటానంటుంది అసిన్.

# విద్యుత్ కోతతో సతమతం

ట్రాన్స్‌కో అమలు చేస్తున్న అనధికార విద్యుత్ కోతతో ప్రజలు అల్లాడిపోతున్నారు. అధికారికంగా నగరంలో ఉదయం ఏడు నుంచి ఎనిమిది గంటల వరకు, సాయంత్రం వేళ ఐదు నుంచి ఆరు గంటల వరకు విద్యుత్ కోత విధిస్తున్నారు. వేసవి తీవ్రత కారణంగా భరించలేని ఉక్కపోత, మరోవైపు కరెంటు కోతతో నగర వాసులు విలవిల్లాడిపోతున్నారు. రోజూ రెండు గంటలు మాత్రమే విద్యుత్ సరఫరా నిలిపి వేస్తున్నామని అధికారులు ప్రకటిస్తున్నా మరమ్మత్తుల పేరుతో ఎడాపెడా విద్యుత్ కోత విధిస్తున్నారు. లైన్లు మరమ్మత్తులు చేస్తున్నామని, చెట్లు కొడుతున్నామని, స్తంభాలకు రంగు వేస్తున్నామని రకరకాల కారణాలు చెప్తున్నప్పటికీ అనధికార కోత పెట్టేందుకే ఇవి చెప్తున్నారనేది జగమెరిగిన సత్యం. పొదలకూరు రోడ్డు, వేదాయపాళెం, మాగుంట లేఅవుట్, తదితర ప్రాంతాలలో రోజూ రెండు మూడు గంటలు అనధికార కోత అమలులో వుంది. ఆ సమయంలో ఉక్కపోత భరించలేక ఆ సబ్‌స్టేషన్ పరిధిలోని సెల్‌ఫోన్లకు ఫోన్‌చేస్తే ఎత్తుకొని సమాధానం చెప్పేవారు వుండరు. ఒకవేళ రిసీవ్ చేసుకొన్నా దురుసుగా, నిర్లక్ష్యంగా సమాధానమిస్తున్నారని వినియోగదారులు వాపోతున్నారు. ట్రాన్స్‌కో అధికారులు మాత్రం ప్రభుత్వం ప్రకటించినవిధంగా నగరంలో రోజు రెండు గంటల కోత తప్ప మిగతా సమయాల్లో విధిస్తున్న కోత తమకు తెలియనట్లే మాట్లాడుతుండడం విశేషం.


కోతలకు మౌనసాక్షి ఈ సబ్‌స్టేషన్.

# బ్రాండెడ్ బియ్యం పేరుతో దగా

రంగు రంగుల బ్యాగుల్లో, అందంగా ముద్రించిన పేర్లతో బియ్యం వ్యాపారులు వినియోగదారులను నిలువునా దోచుకొంటున్నారు. కర్నూలు బియ్యం పేరుతో అమ్మకాలు సాగిస్తున్న వ్యాపారులు ప్రజలకు కొన్ని బ్రాండ్లపై వున్న నమ్మకాన్ని ఆసరా చేసుకొని కల్తీ వ్యాపారం చేస్తూ లక్షలు గడిస్తున్నారు. బిర్యానీ రైస్, టైటానిక్, మంగల్ తదితర బ్రాండ్లతో పంచ రంగులతో తయారుచేసిన సంచుల్లో నాసిరకం బియ్యాన్ని నింపి దోపిడీ చేస్తున్నారు. నెల్లూరుతోపాటు కావలి, గూడూరు, వెంకటగిరి, సూళ్లూరుపేట, నాయుడుపేట ప్రాంతాల్లోని రైసు మిల్లుల వ్యాపారులు ఈ అక్రమాలకు పాల్పడుతున్నట్లు సమాచారం. గత నెలలో కావలిలో దీనికి సంబంధించిన కొందరిని అధికారులు పట్టుకొన్నప్పటికీ చర్యలు నామమాత్రం కావడంతో కల్తీ బియ్యం వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా విరాజిల్లుతుంది. ఈ రైస్‌మిల్లుల వారికి అధికార పార్టీ నేతల అండదండలు వుండడంతో ఇష్టారాజ్యం అయ్యింది. మార్కెట్లో బ్రాండెడ్ రైస్ పేరుతో జరుగుతున్న ఈ అక్రమ వ్యాపారాన్ని ఇప్పటికైనా అధికారులు అరికట్టాల్సి వుంది.



రంగు రంగుల బస్తాలు, పేర్లతో మోసం.

# ఇంటర్‌లో కృష్ణచైతన్య హవా!

మొదటి సంవత్సరం ఫలితాల్లో ముందడుగు

ఇంటర్మీడియట్ ప్రథమ సంవత్సరం ఫలితాల్లో కృష్ణ చైతన్య కళాశాల విద్యార్థులు తమ పట్టు నిలుపుకొన్నారు. జూనియర్ ఇంటర్ ఎంపిసి విభాగంలో దివ్యలక్ష్మి 500 లకు గాను 461 మార్కులు, ఎంఇసి విభాగంలో లోకేష్ 500లకు గాను 480 మార్కులు సాధించి జిల్లా ప్రథములుగా నిలిచారు. మృదుల, సాయిచరణ్‌లు 471 మార్కులు సాధించినట్లు కళాశాల డైరక్టర్ చంద్రశేఖర్‌రెడ్డి తెలిపారు. ఎంపిసి గ్రూపులో 450 నుంచి 459 మధ్య మార్కులను 77 మంది, 440 నుంచి 449 మధ్య మార్కులను 98 మంది సాధించారని చెప్పారు. ప్రణాళికాబద్ధమైన విద్యా బోధనతోనే ఈ ఫలితాలు సాధ్యమయ్యాయన్నారు.


ఇంటర్ ప్రథమ సంవత్సరంలో పరీక్షల్లో జిల్లా ప్రథములతో కృష్ణచైతన్య జూనియర్ కళాశాల నిర్వాహకుడు చంద్రశేఖర్‌రెడ్డి.

## • సింహపురిలో

# మరో మణిహారం సిల్వర్ ప్యాలెస్!

సింహపురి సీమలో బంగారు ఆభరణాల ప్రియులకు మరో పూర్తిస్థాయి వజ్రాభరణాల షోరూం అందుబాటులోకి వచ్చింది. నవ్యత, నాణ్యతలతో నెల్లూరీయుల అభిమానాన్ని చూరగొన్న సిల్వర్ ప్యాలెస్ నూతన షోరూం ప్రారంభోత్సవం జరిగింది. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరుపుకొన్న ఈ షోరూంలో నగర వాసుల అభిరుచికి తగినట్లు పలు రకాల బంగారు, వజ్రాభరణాలను ఆధునిక పోకడలకు తగినట్లు సిద్ధం చేశారు నిర్వాహకులు. ఉంగరం దగ్గర్నుంచి వడ్డాణాల వరకు అన్నిరకాల నగలు విభిన్న మోడల్స్‌లో సిల్వర్ ప్యాలెస్‌లో కొలువుదీరి వున్నాయి. ఆయా వ్యక్తుల అభిరుచులు, నేటితరం యువతుల ఫ్యాషన్లకు అనుగుణంగా ఆభరణాలను వివిధ రూపాలలో ప్రత్యేకంగా తయారుచేయించడం సిల్వర్ ప్యాలెస్ ప్రత్యేకత. 1952లో మండపాల వీధిలో చిన్న షాపుగా ప్రారంభమైన వీరి వ్యాపారం వినియోగదారుల నమ్మకాన్ని చూరగొని అతిపెద్ద ఆభరణాల షోరూంగా అవతరించింది. గాజులు, నక్లెస్‌లు, వడ్డాణాలు, బ్రేస్‌లెట్లు, కమ్మలు, వజ్రాలు పొదిగిన నగలు ఆకట్టుకొనేలా వున్నాయి. కస్టమర్లు తమ షాపుపై పెట్టుకొన్న నమ్మకానికి అనుగుణంగా ఎప్పటికప్పుడు నవ్యతకు ప్రాధాన్యమిస్తూ క్రొత్త రకాలను తయారుచేయించి అందుబాటులో వుంచుతున్నట్లు షాపు నిర్వాహకులు సురేష్‌జైన్, ధర్మేంద్రజైన్ తెలిపారు.


సిల్వర్ ప్యాలెస్ ప్రారంభిస్తున్న రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి. ప్రక్కన ప్యాలెస్ అధినేతలు చందులాల్, సురేష్, ధర్మేంద్ర వున్నారు

# విజయడైరీ పక్షపాత వైఖరి

అయిన వారికి కంచాల్లో కాని వారికి ఆకుల్లో వడ్డన

విజయడైరీలో నెలకొన్న వర్గ విభేదాలు, ఆశ్రిత పక్షపాతం కార్మికుల పాలిట శాపంగా పరిణమించాయి. రెండొందల మందికి పైగా పనిచేస్తున్న ఈ సంస్థల్లో జీతాల చెల్లింపు, పెంపుదలలో పక్షపాతం రాజ్యమేలడం కార్మికులకు ఆవేదనను కల్గిస్తోంది. 90 మంది పర్మినెంటు ఉద్యోగులు కాగా, మిగిలినవారు కాంట్రాక్టు పద్ధతిన పనిచేస్తున్నారు. చాలామందికి కనీస వేతనాలు అమలు కాకపోవడంతో పలువురు కార్మిక సంఘ నాయకులు కలెక్టర్‌ను కలసి సమస్యను వివరించారు. ఆయన కార్మికులందరికీ కనీస వేతనాలు అందజేయాలని ఆదేశించినప్పటికీ అది అమలు కావడం లేదు. పాలకవర్గంతో అనుకూలంగా వ్యవహరించే వారికి మాత్రం జీతాల్లో పెరుగుదల అధికంగా వుండడం, మిగతా వారికి స్వల్పంగా వుండడం, మరి కొందరికి అది కూడా వుండకపోవడంతో కార్మికులు పక్షపాత వైఖరిని తట్టుకోలేక పోతున్నారు. గత పాలకవర్గం ఇలాంటి పక్షపాత ధోరణిని అమలు చేశారని, నూతన పాలకవర్గమైనా అందరికీ సమన్వయం చేస్తుందని ఆశించినప్పటికీ ఆ ఆశ అడియాసే అయ్యిందని పలువురు కార్మికులు వాపోతున్నారు.



వివాదాల్లో విజయడైరీ.


నెల్లూరు జైన్‌గోల్డ్ లక్కీడ్రా విజేత జహీరాకు స్కూటీని అందజేస్తున్న విజయకుమార్ సింఘానియా. ప్రక్కన షోరూం అధినేత మణిలాల్ జైన్.

## రెండింటికీ చెడుతున్న రోశయ్య

మొదటి పేజీ కొరవ

రం చేయగానే, వెనుకా ముందు ఆలోచన లేకుండా ఆయనకు అండగా నిలబడిన వారిలో జెసి.దివాకర్‌రెడ్డి, మర్రి శశిధర్‌రెడ్డి అతి ముఖ్యులు. రోశయ్య దగ్గరకు వెళ్తే తమను జగన్ ఏమి చేస్తాడోనన్న భయంతో కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, మంత్రులు సిఎం పేషీ ఛాయలలో కనిపించడానికి కూడా భయపడుతున్న రోజులలో ధైర్యంగా ఆయన పక్కన నిలబడిన అతి కొద్దిమందిలో వీరు అతి ముఖ్యులు. కానీ అదే దివాకర్‌రెడ్డిని ఆయన స్వంత జిల్లా అనంతపురంలో అవమానించాడు రోశయ్య. ఆ జిల్లా పర్యటనకు వెళ్లి, జెసికి బద్ధ శత్రువైన రఘువీరారెడ్డి ఆతిథ్యం స్వీకరించాడు. అన్ని సభలను రఘువీరా పెత్తనానికి వదిలి పెట్టాడు. ఆ సభలకు వెళ్లి, అనామకుడిగా నిలబడడం అవమానంగా భావించిన జెసి, అసలు ముఖ్యమంత్రి పర్యటననే బహిష్కరించి, హైదరాబాద్‌కు వెళ్లిపోవలసి వచ్చింది.

దాదాపుగా అన్ని జిల్లాల్లోనూ ఇదే తీరులో నడుస్తున్నాయి ముఖ్యమంత్రి పర్యటనలు. రోశయ్య అంటే ఎంత మాత్రం గౌరవ మర్యాదలు లేని జగన్ అనుచర మంత్రులు సభలను హైజాక్ చేస్తున్నారు. రోశయ్యతో అనుబంధం పెంచుకొందామని భావించిన ఎమ్మెల్యేలు వెనుక వరసలో నిలబడవలసి వస్తున్నది.

దీని ప్రభావం ముందు ముందు రోశయ్య పరిపాలనపై తీవ్రంగా వుండబోతుందన్నది పరిశీలకుల అంచనా. అటు జగన్ వర్గం నుంచి సహకారం లభించక, ఇటు తన స్వంతమనిషి అనేవాడు మిగలక ఎందుకూ పనికి రాకుండా పోతాడన్న అభిప్రాయం ఏర్పడుతున్నది. ముఖ్యమంత్రి బాధ్యతల నిర్వహణలో రోశయ్యను వేధిస్తున్న ప్రధాన సమస్య – అనారోగ్యం. ఎక్కువ పని చేయడం ఆయన వల్ల కావడం లేదు. ఒక గంట కుర్చీలో కూర్చున్నా, కొద్ది సేపు కారులో ప్రయాణం చేసినా కనీసం ఒక గంట విశ్రాంతి తీసుకొంటే తప్ప నిలబడలేక పోతున్నాడాయన. జిల్లాస్థాయి పర్యటనలలో ఈ సమస్య కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. పరిపాలన మీద ఎక్కువ దృష్టి పెట్టలేని పరిస్థితి ఏర్పడినప్పుడు, ఆంతరంగికులైన వారి సహకారం చాలా అవసరం. నమ్మకస్తులకు కొన్ని బాధ్యతలను అప్పచెప్పాలి. కానీ మంత్రివర్గంలో అటువంటివారు ఒక్కరూ లేరు. సందు దొరికితే రోశయ్యను ఎక్కడో ఒక దగ్గర ఇరికించి, ఇబ్బంది పెట్టాలని చూసే వారే ఎక్కువ. ఈ పరిస్థితులలో ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా మంత్రివర్గ విస్తరణ జరిపి, తన స్థానాన్ని పటిష్టం చేసుకోవాల్సిన ముఖ్యమంత్రి, పూగిసలాట ధోరణితో ఇద్దరికీ పనికిరాని వాడై పోతున్నాడు. వారు లెక్కపెట్టరు, వీరు దూరమై పోతున్నారు. ఇక పరిపాలన నడిచేదెట్లా?

### మర్రి ఢిల్లీ మకాం

కనీసం ఢిల్లీ నుంచి ఒత్తిడి తెచ్చి అయినా రోశయ్యను మార్చాలన్న ప్రయత్నం ఒకటి మొదలైంది. సనత్‌నగర్ శాసనసభ్యుడు మర్రి శశిధర్‌రెడ్డి ఇప్పుడా పనిలోనే ఢిల్లీలో మకాం పెట్టాడు. రోశయ్య మీద తాను పెంచుకొన్న ఆశలన్నీ అడియాశలు కావడంతో, ఢిల్లీ వర్గాలలో తన పలుకుబడి ప్రయోగించాలన్న పట్టుదల చూపుతున్నాడు. మర్రి శశిధర్ రెడ్డికి ఢిల్లీలో మంచి పరిచయాలున్నాయి. సాక్షాత్తు ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్‌కు శశిధర్‌రెడ్డి అంటే అభిమానం. ప్రణబ్ ముఖర్జీ కూడా ఆయన్ను దగ్గరకు తీస్తాడు. మర్రి చెన్నారెడ్డి కుమారుడు కావడం, మేధావి తరహాలో రాజకీయ ఆలోచనలు చేయగలగడం శశిధర్‌రెడ్డి అనుకూలతలు. పైగా ఎటువంటి రాజకీయ వివాదంలో తలదూర్చక పోవడం ఆయన ప్రత్యేకత. ఢిల్లీ పెద్దలను ఒప్పించి, మంత్రివర్గ ప్రక్షాళన అవసరాన్ని వివరించి చెప్పి, అందుకు అనుమతి తేవడం మర్రి శశిధర్‌రెడ్డి లక్ష్యం. ఆయనకు జెసి.దివాకర్‌రెడ్డి వంటి వారి సహకారం వుంది.

## పుంజుకోవడం లేదు

16వ పేజీ కొరవ

రెండింటికీ దూరంగా మసలుతున్నాడు చంద్రబాబు. వాటిని సమర్థించడం లేదు, వ్యతిరేకించడం లేదు. మరొకప్రక్క తన పార్టీ రెండు ప్రాంతాలలో రెండురకాల అభిప్రాయాలు వెలిబుచ్చేందుకు అనుమతిచ్చారాయన. దానితో ఏ ప్రాంతం వారికి కూడా తెలుగుదేశం విధానం ఏమిటో తెలియడం లేదు. ప్రాంతీయ ఉద్యమాల విషయంలో ఆ పార్టీ అభిప్రాయం ప్రజలలో చర్చకు రావడం లేదు. సమైక్యాంధ్ర విషయంలో కాంగ్రెస్‌వాదుల వాదనలు, తెలంగాణ విషయంలో టిఆర్‌ఎస్ ఉద్యమం మాత్రమే జనం దృష్టిలో వున్నాయి. ఇంత కీలకమైన విషయంలో తెలుగుదేశం వంటి ప్రధాన పార్టీకి ఒక విధానమంటూ లేకపోవడం చాలాపెద్ద లోపం. అందరికీ మంచిగా వుండాలనే తాపత్రయంలో అందరికీ దూరమై పోతున్నాడు చంద్రబాబు.

రోశయ్య ప్రభుత్వాన్ని నిలబెట్టే బాధ్యతను పరోక్షంగా తాను స్వీకరించడం కూడా చంద్రబాబుకు తెలియని నష్టం కల్గిస్తున్నది. ప్రభుత్వం చేసే తప్పులను ఎత్తి చూపడానికి వెనుకాడుతున్నాడాయన. దానితో ప్రతిపక్షం ఒకటి వుందనే స్పృహ ప్రజలలో కలగడం లేదు. ఏ విషయంలో కూడా తెలుగుదేశం పార్టీ చర్చకు రావడం లేదు. నిజానికి అధిక ధరలు, విద్యుత్ చార్జీల పెంపు, ఆర్టీసి చార్జీల పెంపు, జలయజ్ఞం ప్రాజెక్టుల నిలిపివేత, రేషన్ కార్డుల ఏరివేత, పెన్షన్ల పంపిణీలో జరుగుతున్న అవకతవకలు, ఇందిరమ్మ ఇళ్ల సమస్యలు వంటి వాటిమీద స్థానిక స్థాయి నుంచి రాష్ట్రస్థాయి వరకు ఉద్యమాలు చేయవలసిన అవసరం వుంది. అది ప్రతిపక్షం బాధ్యత. వారు అందుకు పూనుకొంటే, ఆయా సమస్యల వల్ల బాధితులైన వారు ఆ పార్టీ వైపు దృష్టి సారిస్తారు. కానీ తెలుగుదేశం పార్టీ ఈ సమస్యలు ఒక్కదాని మీద కూడా విస్తృత స్థాయిలో ప్రజా ఉద్యమానికి పూనుకోవడం లేదు. పత్రికా ప్రకటనలతో సరిపెడుతున్నది. ఇక ఆ పార్టీతో ప్రజలకు పనేమి వుంది చెప్పండి?

కొందరు సీనియర్ స్థాయి తెలుగుదేశం నాయకులు కూడా ఈ పరిస్థితి పట్ల ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఆంతరంగిక సంభాషణలలో అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ఐదు నెలలో మునిసిపల్ ఎన్నికలు పెట్టుకొని, పార్టీ ఇంత నిద్రాణంగా వుండడం ఎంత మాత్రం మంచిది కాదన్న చింత వారిని వేధిస్తున్నది. కానీ చంద్రబాబు వ్యూహం వారికి అర్థం కావడం లేదు. తమ మనసులో మాట ఆయన వద్దకు వెళ్లి చెప్పే సాహసం అసలే చేయరు.

# రాజ్యసభ ఎన్నికలు రసవత్తరం!

**● కాంగ్రెస్, తెలుగుదేశం తరఫున పోటీచేయను పోటాపోటీ!**

రాష్ట్రం నుంచి ఖాళీ కానున్న ఆరు రాజ్యసభ సీట్ల కోసం ఇటు కాంగ్రెస్, అటు తెలుగుదేశం పార్టీలలో ముమ్మరమైన ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రస్తుతం కాంగ్రెస్ తరఫున ఐదుగురు – కేంద్రమంత్రి జైరాం రమేష్, మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్దనరెడ్డి, వార్త పత్రిక యజమాని గిరీష్ సంఘీ, ఎస్సీ నాయకుడు జెడి.శీలం, మాజీ పిసిసి అధ్యక్షుడు వి.హనుమంతరావు – వున్నారు. ఆరవ స్థానంలో సిపిఎంకు చెందిన మధు వున్నాడు. అయితే ఇప్పుడు జరిగే ఎన్నికలలో సిపిఎంకు స్థానం లేదు. గత ఎన్నికలలో కాంగ్రెస్ మిత్రపక్షంగా ఈ పదవి తెచ్చుకొన్నారు వారు. అప్పట్లో కాంగ్రెస్‌కు 185 మంది ఎమ్మెల్యేలు, మిత్రపక్షాలకు మరొక 40 మందికి పైగా ఎమ్మెల్యేలు వున్నారు కాబట్టి అన్ని సీట్లు కాంగ్రెస్ పక్షం అయ్యాయి. కానీ ఇప్పుడా పరిస్థితి లేదు. ప్రస్తుతం శాసనసభలో కాంగ్రెస్ బలం 150 మాత్రమే. ఒక్కొక్క రాజ్యసభ అభ్యర్థికి కనీసం 42 ఓట్లు కావాలి. ఆ లెక్క ప్రకారం కాంగ్రెస్ నికరంగా గెలుచుకోగల్గిన స్థానాలు మూడు మాత్రమే. నాలుగవ స్థానంలో గెలవాలంటే ప్రజారాజ్యం (18), మజ్లిస్ (7)ల సహకారం కావాలి. తెలుగుదేశానికి రెండు సీట్లు నికరంగా వచ్చి, మరొకపది ఓట్ల వరకు ఖాళీగా వుంటాయి.

కాంగ్రెస్‌లో వున్న ఐదుగురు రాజ్యసభ సభ్యులలో ఎవరెవరికి మళ్లీ ఛాన్స్ వస్తుందన్నది సమస్య. జైరాం రమేష్ కేంద్రమంత్రి హోదాలో వున్నాడు కాబట్టి, ఆయన పేరు మొదటగా ఖరారు కావచ్చు. నేదురుమల్లి జనార్దనరెడ్డికి మొన్నటి లోక్‌సభ ఎన్నికలలో నెల్లూరు స్థానానికి బదులుగా రాజ్యసభ ఇచ్చారు. అది కేవలం ఏడాది మాత్రమే మిగిలివున్న సభ్యత్వం. అందువల్ల ఈ ఎన్నికలలో ఆయనకు మళ్లీ అవకాశం ఇస్తామని వైఎస్.రాజశేఖర్‌రెడ్డి, సోనియా గాంధీలిద్దరూ హామీ ఇచ్చారని వినికిడి. అందువల్ల ఆయనకు ఇబ్బంది వుండకపోవచ్చు. గిరీష్ సంఘీకి మరొక ఛాన్స్ ఇచ్చే అవకాశమే లేదని ఢిల్లీ వర్గాల భోగట్టా. 2004 ఎన్నికలలో ఒకే ఒక కాంగ్రెస్ పత్రికగా వార్తకు గుర్తింపు వుండేది. ఆ సేవకు ప్రతిఫలంగా ఆయనకు ఆ పదవి ఇచ్చాడు రాజశేఖర్ రెడ్డి. కానీ ఇప్పుడు కాంగ్రెస్ పార్టీకి స్వంత పత్రికగా సాక్షి వుంది. అందువల్ల పత్రికాధిపతిగా ఆయనకు అవకాశం ఇవ్వాల్సిన అవసరం లేదు. అయితే తాను రోశయ్యకు ముఖ్యుడను కాబట్టి, తనకూ ఛాన్స్ వుందని సంఘీ భావిస్తున్నాడు. కానీ రోశయ్య రాజ్యసభ ఎన్నికలలో తలదూర్చి, తన తరఫున సిఫార్సు చీటీ ఇస్తాడని భావించలేము. మంత్రివర్గాన్ని పునర్నిర్మించుకోలేని ఆయన రాజ్యసభ ఎన్నికలలో వేలు పెట్టడం జరిగే పనా? జెడి.శీలం, ఢిల్లీ వర్గాలలో మంచి పలుకుబడి వున్నవాడు. ఆస్కార్ ఫెర్నాండెజ్‌కు ఆంతరంగిక మిత్రుడు. పైగా ఎస్సీ నాయకుడు. అందువల్ల ఆయన పేరును అంత తేలికగా తీసి పక్కన పెట్టలేరు. వి.హనుమంతరావు పరిస్థితి కొంచెం కష్టంగా వుంది. ఇప్పటికే రెండుసార్లు వరసగా రాజ్యసభ సభ్యత్వం పొందారాయన. అంతకు క్రితం కూడా ఒకసారి కొద్దికాలం ఆ పదవిలో వున్నాడు. ఇప్పుడు నాలుగవసారి అవకాశం ఇస్తారా అన్నది ప్రశ్న. అయితే హనుమంతరావు సోనియా కుటుంబానికి అత్యంత ఆప్తుడు. ఆత్మీయుడు. ఆయన బలం మొదట నుంచీ అదే.

కాంగ్రెస్ నికరంగా గెలుచుకోగల్గిన స్థానాలు మూడు మాత్రమే కాబట్టి, ఇప్పుడున్న ఐదు మందిలో ఇద్దరిని పక్కన పెట్టక తప్పదు. ఆ దురదృష్టవంతులెవరో ఒక్క సోనియాగాంధీకి మాత్రమే తెలుసు.

### వెంకటరామిరెడ్డి రేటు ఓటుకు రెండుకోట్లు

నాలుగవ స్థానానికి ప్రజారాజ్యం, మజ్లిస్‌లతో సంధి కుదుర్చుకోవాలి. ఇప్పటివరకు ముఖ్యమంత్రి రోశయ్య ఆ ప్రయత్నం మొదలు పెట్టలేదు. ఆ ప్రతిపాదన తెస్తే, వారేమి గొంతెమ్మ కోరికలు కోరుతారో తెలియదు. కాంగ్రెస్‌లో ఈ సందిగ్ధతను ఒక అవకాశంగా వాడుకోవాలని కొందరు కుబేర సమానులు తాపత్రయపడుతున్నారు. డెక్కన్ క్రానికల్ పత్రిక అధినేత టి.వెంకటరామరెడ్డి వారిలో ఒకరు. రాజ్యసభకు గెలవాలన్న కోరిక ఆయనకు చానాకాలం నుంచి వుంది. కోట్ల విజయభాస్కర్ రెడ్డి, వైఎస్.రాజశేఖర్‌రెడ్డిల ప్రాపకంతో ఆ కోరిక తీర్చుకోవాలని ప్రయత్నం చేసినా వీలు కాలేదు. ఒకదశలో చంద్రబాబు నాయుడు ద్వారా కూడా ప్రయత్నం చేశాడు. ఇప్పుడాయన అపర కుబేరుడు. ఐపిఎల్ క్రికెట్ జట్టుతో దేశవ్యాప్తంగా గుర్తింపు కూడా పొందాడు. ప్రజారాజ్యం, మజ్లిస్ పార్టీలను టోకున, కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలలో ఎవరికి కేటాయించని ఓట్లను రిటైల్ ప్రాతిపదికన కొనుగోలు చేసి తన చిరకాల వాంఛ తీర్చుకోవాలని తపన బడుతున్నాడు. అందుకాయన ఒక్కొక్క ఓటుకు రెండు కోట్ల వరకు చెల్లించడానికి సిద్ధపడుతున్నాడట. ఆ మాట విన్నప్పటి నుంచి ఎమ్మెల్యేలకు నోట్లో నీళ్లు వూట బావి వలె వూరుతున్నాయి. సగం ఎన్నికల ఖర్చు ఒకే దెబ్బకు జమ అవుతుందంటే ఎవరికి ఆశ కలగదు చెప్పండి?

మొన్నటి ఎన్నికలలో మహబూబ్‌నగర్ నుంచి ఓడిపోయిన కాంగ్రెస్ అభ్యర్థి విఠల్‌రావు కూడా ధన అస్త్రం వాడడానికి సిద్ధపడుతున్నట్లు వినికిడి.

తెలుగుదేశానికి సంబంధించి రెండు సీట్లు నికరం. ఆంధ్ర ప్రాంతానికి ఒకటి, తెలంగాణకు మరొకటి ఇవ్వాలన్నది చంద్రబాబు ఆలోచన అట. ఆంధ్ర నుంచి కంభంపాటి రామ్మోహన్, ఎర్రం నాయుడు, యనమల రామకృష్ణుడు వంటివారు చాలా మందే పోటీ వున్నారు. తెలంగాణ నుంచి కడియం శ్రీహరి పేరు వినపడుతున్నది. మొత్తం మీద ఈసారి రాజ్యసభ ఎన్నికలు రంజుగా వుండబోతున్నాయి.

## బలిపీఠమెక్కుతున్న డిఎస్

మొదటి పేజీ కొరవ

ఉపఎన్నికలలో ఏ కారణం వల్లనైనా ఓటమి ఎదురైతే డిఎస్ రాజకీయ భవిష్యత్తుకు సమాధి పడిపోతుంది. ఆయన పెద్దరికానికి ఎంత మాత్రం విలువ వుండదు. అయితే, తాను గెలిస్తే, తెలంగాణ ఏర్పాటు సమయంలో ముఖ్యమంత్రిని అవుతానన్న ప్రచారంతో జనాన్ని ఆకర్షించే అవకాశం వుంది డిఎస్‌కు. ఆ ఒక్క అవకాశంతో నెగ్గుక రావాలి ఆయన. ఆ ప్రయోగం ఫలిస్తే ఫర్వాలేదు, విఫలమైతే మాత్రం బలిదానం తప్పదు.

# ట్రిపుల్ ఐటిల్లో సీట్ల తగ్గింపు బాధాకరం

విద్యార్థిలోకానికి తీవ్ర నిరాశను కల్గించే నిర్ణయం తీసుకొంది రాష్ట్రప్రభుత్వం. అది రాష్ట్రంలోని మూడు ట్రిపుల్ ఐటి కళాశాలల్లో సీట్ల సంఖ్యను సగానికి తగ్గించాలని నిర్ణయం. దీని వలన గ్రామీణ ప్రాంత విద్యార్థులకు తీవ్ర నష్టం కలుగనుంది. సాంకేతిక విజ్ఞానాన్ని పట్టణ, నగరాలకు చెందిన విద్యార్థులతోపాటు గ్రామీణ ప్రాంత విద్యార్థులకు అందించాలన్న లక్ష్యంతో రెండు సంవత్సరాల క్రిందట బాసర, ఇడుపులపాయ, నూజివీడుల్లో ట్రిపుల్ ఐటి కళాశాలలను ఏర్పాటు చేశారు. ఒక్కో విద్యాలయంలో ప్రతి ఏటా రెండు వేల సీట్లను కేటాయిస్తూ మూడు కళాశాలల్లో మొత్తం 6వేల సీట్లుగా ప్రకటించింది ప్రభుత్వం. గ్రామీణ ప్రాంత విద్యార్థులు తాము సాంకేతిక విజ్ఞానాన్ని అందిపుచ్చుకోగలమని సంతోషించారు. రాజీవ్‌గాంధీ సాంకేతిక విజ్ఞాన విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో పై మూడు కళాశాలలను ఏర్పాటు చేశారు. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ వీటిని ప్రారంభించారు. మూడో సంవత్సరంలోకి అడుగుపెట్టేసరికి ట్రిపుల్ ఐటిలపై నీలినీడలు కమ్ముకొన్నాయి. తీవ్ర ఆర్థిక భారం కారణంగా ప్రభుత్వం ఆ సీట్ల సంఖ్యను ఆరు వేల నుంచి మూడు వేల వరకు కుదించి వేసింది. మంత్రివర్గ సబ్ కమిటి దీనిపై ప్రభుత్వానికి నివేదిక ఇవ్వడంతో సీట్లలో కోత విధిస్తూ నిర్ణయం తీసుకొంది ప్రభుత్వం. మౌలిక వసతులు, సౌకర్యాలు విద్యార్థుల సంఖ్యకు తగినట్లుగా లేనందువలనే సీట్ల సంఖ్యను తగ్గించినట్లు మంత్రులు చెప్తున్నా తీవ్రమైన ఆర్థిక సంక్షోభం, కోట్లరూపాయల మేర కళాశాలలకు బకాయిల పడడంతో నిర్వహణ కష్టంగా మారినందునే కోత విధించారనే విమర్శలు వినవస్తున్నాయి. సాధ్యసాధ్యాలను అంచనా వేయకుండా కళాశాల ప్రారంభంలో సీట్ల సంఖ్యను ఒక్కసారిగా పెంచడం తదితర కారణాలే విద్యార్థుల పాలిట శాపంగా పరిణమించాయన్నది వాస్తవం. దీనిపై వివిధ వర్గాల ప్రజలు అభిప్రాయాలు ఈ విధంగా వున్నాయి.



### శరాఘాతం

ట్రిపుల్ ఐటిలో సీట్ల సంఖ్యను సగానికి తగ్గించడం వలన విద్యార్థులకు తీవ్ర నష్టం కలుగనుంది. ఎంతో ఆశగా ప్రవేశం కోసం ఎదురు చూస్తున్న విద్యార్థులకు, తల్లిదండ్రులకు ఇది శరాఘాతం. ముఖ్యంగా గ్రామీణ ప్రాంత విద్యార్థులపై తీవ్ర ప్రభావాన్ని చూపుతుంది. విద్యార్థుల భవిష్యత్తును దృష్టిలో వుంచుకొని సీట్లను యధావిధిగా భర్తీ చేయాలి.

– **పెంచలలక్ష్మి,** నెల్లూరు.



### విద్యార్థులు నష్టపోతారు

రాష్ట్రప్రభుత్వం అనాలోచిత నిర్ణయాల వలన విద్యార్థులకు తీవ్ర నష్టం వాటిల్లుతోంది. కళాశాలలు స్థాపించే విషయంలో ఆర్థిక ఇబ్బందులు, ఇతరత్రా సదుపాయల గురించి ఆలోచించకుండా మూడేళ్ల గడచిన తర్వాత ఒక్కసారిగా ట్రిపుల్ ఐటి సీట్లను 6వేల నుంచి 3వేలకు తగ్గించడం వలన గ్రామీణ ప్రాంత విద్యార్థులు అధికంగా నష్టపోతారు. దీనిని దృష్టిలో వుంచుకొని ప్రభుత్వం తన నిర్ణయం మార్చుకోవాలి.

– **మురళి,** నెల్లూరు.

# తీరుమారని కార్పొరేషన్ సమావేశాలు!

మునిసిపల్ కార్పొరేషన్ సమావేశం నిర్వహించే ప్రతిసారి గందరగోళ పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ప్రజాసమస్యలపై సామరస్యంగా చర్చించి ఆమోదించాల్సిన కౌన్సిల్ సభ్యులు వీధి రౌడీల్లా వ్యవహరిస్తూ సమావేశాలను గబ్బు పట్టిస్తున్నారు. ప్రజా సమస్యలను ప్రక్కన పెట్టి వ్యక్తిగత దూషణలకే అధిక ప్రాధాన్యతనిస్తున్నారు. సమావేశం ప్రారంభం దగ్గర నుంచి పూర్తయ్యేవరకు పలు దఫాలు వాయిదా పడుతుంది.



**సమావేశంలో ఆల్‌పాస్ అంటూ వెళ్లిపోతున్న మేయర్ భానుశ్రీని నిలదీస్తున్న సిపిఎం కార్పొరేటర్లు.**

ఇటీవల బడ్జెట్ ఆమోదం కోసం నిర్వహించిన సమావేశం, ఈ నెల 26వ తేదిన జరిగిన కౌన్సిల్ సాధారణ సమావేశాలను ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు. ప్రతి సమావేశంలో అధికారపక్షం సభ్యులకు మాత్రమే మాట్లాడే అవకాశం కల్పిస్తూ, ప్రతిపక్షపార్టీలకు చెందిన కార్పొరేటర్లకు అవకాశం కల్పించడంలో మేయర్ వివక్షత చూపుతూ వస్తున్నారు. కార్పొరేషన్ బడ్జెట్ రూపొందించడంలో కౌన్సిల్ అజెండాలో చేర్చిన అంశాల్లోను అనేక లోపాలు వుండడంతో సభ్యులు వీటిపై అభ్యంతరాలు వ్యక్తం చేసే అవకాశం వుంటుంది.

దీనిని ముందుగా గుర్తించిన అధికార పక్షం సభ్యులు, మేయర్ సమావేశాన్ని ప్రక్కదారి పట్టించి ఎటువంటి చర్చ లేకుండానే అజెండాలోని అన్ని అంశాలను ఆమోదించినట్లు ప్రకటించడం ఇటీవల ఆనవాయితీగా మారిపోయింది. దీనిపై ప్రతిపక్ష కార్పొరేటర్లు ఎన్నిసార్లు ఆక్షేపణలు తెలిపినా పట్టించుకునే దిక్కులేకుండా పోయారు. సాధారణ కౌన్సిల్ సమావేశంలో అజెండాలో 24 అంశాలను చేర్చారు. నెల్లూరు నగరంలో మినిబైపాస్ రోడ్డు నుంచి కొండాయపాళెం ప్రాథమిక పాఠశాల వరకు తారురోడ్డు నిర్మాణం, విజయమహాల్ గేటు నుండి వి.ఆర్ చిల్డ్రన్స్ అకాడమి వరకు సిమెంటురోడ్డు నిర్మాణం చేపట్టాలని సూచించారు.

ఇందుకు ప్రభుత్వం 3కోట్ల 51లక్షల 65వేల రూపాయలు విడుదల చేసింది. దీనిపై కూడా టిడిపి, సిపిఎం కార్పొరేటర్లు అభ్యంతరం వ్యక్తం చేశారు. మరమ్మతులు చేపట్టాల్సిన సిమెంటురోడ్డు కంటే విజయమహల్‌గేటుకు తూర్పువైపున వున్న వీధి చాలా అధ్వాన్నంగా వుందని దీని గురించి ఎందుకు పట్టించుకోరని నిలదీశారు. ఒక సందర్భంలో సందాని బాష, రూప్‌కుమార్ యాదవ్‌లు ఒకరిపై ఒకరు వ్యక్తిగత విమర్శలు చేసుకుంటూ చొక్కాలు పట్టుకునే స్థితికి వెళ్లారు బయటకు రారా... చూసుకుందాం అంటూ సవాళ్లు చేసుకొన్నారు.

ఈ సంఘటనకు సమావేశ హాలులో ఉద్రిక్తత వాతావరణం ఏర్పడడంతో మేయర్ పది నిమిషాలు సమావేశాన్ని వాయిదా వేశారు. ఇదిలా వుండగా టిడిపి కార్పొరేటర్ సుబ్బారావు పొరపాటున మైకు ఆఫ్ చేయడంతో అతన్ని సస్పెండ్ చేస్తూ మేయర్ భానుశ్రీ రూలింగ్ ఇవ్వడం జరిగింది. పలుమార్లు సమావేశం నుంచి సుబ్బారావును బయటకు వెళ్లాలని ఆదేశించినా ఆయన ససేమిరా అన్నారు. దీంతో కాంగ్రెసు కార్పొరేటర్ చాట్ల నరసింహారావు కల్పించుకుని కార్పొరేటర్ సుబ్బారావు వుద్దేశ్యపూర్వకంగా మైకును ఆఫ్ చేయలేదని సౌండ్ తగ్గించాలని చేసిన ప్రయత్నంలో పొరపాటు జరిగిందని వివరణ ఇచ్చారు.

మొత్తం మీద కౌన్సిల్ సమావేశం ప్రక్కదారి పట్టించి ఎదురు దాడికి దిగి అజెండాలోని మొత్తం అంశాలను ఆమోదింపచేసుకోవడంలో మేయర్ భానుశ్రీ సఫలీకృతులవుతున్నారు.

ఆవేశం కవిత

## కామాంధులు

చెల్లెల్లారా!
చిట్టి తల్లుల్లారా
ఈ జనారణ్యంలో
మానవ మృగాలు
మారువేషాల్లో సంచరిస్తున్నాయి
పంచల్లో రావణులు
పైజమాల్లో ఫకీర్లు
టక్కు టైల్లో దుశ్శాసనులు
సూటు బూటుల్లో కీచకులు
మన చుట్టే మాటేసిన కాలమిది
ఈ ఎద్దుతలల పెద్దలు
అధికారం చాటున అకృత్యాలు
తలనెరుపు మాటున కామనృత్యాలు
విచ్చలవిడిగా విలాసిస్తున్నారు
నేరాలు వీరే చేస్తారు
న్యాయాలు వీరే చెప్తారు
చట్టం వీళ్ల చుట్టమై
ధర్మం దాగుడుమూతలాడుతుంది
చెల్లెల్లారా....
ఆ నల్ల కళ్లద్దాల మాటున
బుసలు కొట్టె కాముల్ని
ఈ తెల్లటి దుస్తులచాటున
కాటేసే పాముల్ని
తొడగొట్టి పడగొట్టే భీముడు
బాణంతో సంహరించే రాముడు
ఎక్కడా లేడమ్మా
ఇక ఎప్పుడూ రాడమ్మా
తల్లుల్లారా... మీరిప్పుడు
త్రేతాయుగపు సీతలు కారు
ద్వాపర యుగపు ద్రౌపదులు కారు
కలికాలపు కాళికలు మీరు
రుద్రనాలికలు మీరు
కళ్లు తెరవండమ్మా – కనకదుర్గల్లారా
కదను తొక్కండమ్మా – కళుగోళమాతల్లారా
ఇప్పుడు కావాల్సింది
శిశుపాల శిరచ్ఛేదాలు కాదు
ఈ అధికార మధాందుల
పదవీచ్ఛేదాలు
అర్థమైతే – అధికారమూ మీదే
అర్థరాజ్యమూ మీదే
అర్థం కాలేదా ?
అంధకారమూ మీదే!
అధః పాతాళమూ మీదే !!

– ***చంద్రిక,*** నెల్లూరు.

# కాంగ్రెస్ ఎంత నిర్వీర్యంగా వున్నా తెలుగుదేశం మాత్రం పుంజుకోవడం లేదు!

రాష్ట్ర రాజకీయం అయోమయంగా కన్పిస్తున్నది. అర్థంకాని తీరులో నడుస్తున్నది. ముఖ్యమంత్రి రోశయ్య సాచేటు ధోరణి వల్ల కాంగ్రెస్ వర్గాలలో ఎంతమాత్రం ఉత్సాహం లేదు. వైఎస్ వున్న రోజులలో కాంగ్రెస్‌వాదులు ఉత్సాహంతో వురకలు వేసేవారు. ఏ సమస్య ఎదురైనా వైఎస్ వున్నాడు లేమ్మనే ధైర్యంతో హాయిగా తిరిగేవారు ఎమ్మెల్యేలు, కార్యకర్తలు. వైఎస్ దయ వుంటే కాని పని లేదన్న నమ్మకం వుండేది. అటు ప్రతిపక్షాలకు కూడా వైఎస్ వున్నప్పుడు చేతినిండా పని. రోజూ ఏదో ఒక అవినీతి కథ వెలికితీసి అల్లరి చేసేవారు. ఇప్పుడా పరిస్థితి లేదు. రోశయ్య మీద కాంగ్రెస్‌వాదులకు విశ్వాసం కలగడం లేదు. అదే సమయంలో రోశయ్యను ఇబ్బంది పెట్టడం ప్రతిపక్షాలకు ఇష్టం లేదు. మరీ ముఖ్యంగా చంద్రబాబు నాయుడు, ఈనాడు రామోజీరావు వంటివారు రోశయ్య వచ్చే నాలుగేళ్లు నికరంగా పదవిలో కొనసాగాలని కోరుకొంటున్నారు. ఆయనకు సమస్య వస్తే జగన్ దూరి పోతాడన్నది వారి భయం. అందువల్ల ముఖ్యమంత్రి మీద ఈగ వాలకుండా జాగ్రత్త పడుతున్నారు. శాసనసభ సమావేశాలలో అయితే రోశయ్య, చంద్రబాబుల మధ్య మ్యాచ్ ఫిక్సింగ్ తరహా ఆట నడిచిందని అందరికీ తెలుసు.

రాష్ట్రం ఆర్థిక సంక్షోభంలో చిక్కుక పోవడం వల్ల అభివృద్ధి కార్యక్రమాలన్నీ ఎక్కడివక్కడే నిలిచిపోయాయి. ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణం ఆగిపోయింది. జలయజ్ఞం పనులు మందగించాయి. అవి ఎప్పటికి పూర్తి అవుతాయో ఎవరికీ తెలియదు. ప్రాణహిత, పోలవరం వంటి భారీ ప్రాజెక్టులు ఎప్పటికీ రాకపోవచ్చునని చెప్తున్నారు. కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, మంత్రులు ప్రజలలో తిరగడానికి ఆసక్తి చూపించడం లేదు. వారిని ముందుకు నడిపించే నాయకత్వం లేదు. పార్టీ కార్యకర్తలలో అయితే ఒక విధమైన నీరస భావం నెలకొంటున్నది. భవిష్యత్తు మీద ఆశ అంతరించి పోతున్నది. గ్రామస్థాయిలో పరిస్థితి గమనిస్తే, అసలు ప్రభుత్వం వుందా లేదా అన్న అనుమానం కలిగేట్లు వుంది పరిస్థితి. ధరల పెరుగుదల, కొత్తగా ఉద్యోగాలు లేకపోవడం, ఎంతో ప్రచారార్భాటంతో ప్రారంభించిన ఎస్‌ఇజడ్‌లు, పారిశ్రామిక వాడలు బీడు భూములుగా మిగిలిపోవడం, దాని వల్ల ఉద్యోగాలు దొరకుతాయన్న ఆశ క్షీణించిపోవడం వంటి కారణాల వల్ల ప్రజలలో కూడా ప్రభుత్వం పట్ల నమ్మకం నశిస్తున్నది.

సాధారణంగా ఇటువంటి పరిస్థితులు ఏర్పడినప్పుడు ప్రతిపక్షాలు లాభపడాలి. కానీ విచిత్రంగా కాంగ్రెస్ ఎంత నిర్వీర్యంగా కన్పిస్తున్నా, తెలుగుదేశం మాత్రం పుంజుకోవడం లేదు. గతవారం రోజులుగా జరుగుతున్న ప్రజాపథం కార్యక్రమాలను గమనిస్తే ఈ పరిస్థితి స్పష్టంగా అర్థమౌతున్నది. ప్రజలు ప్రభుత్వాన్ని తిడుతున్నారు. కానీ ప్రతిపక్షాన్ని దగ్గరకు రానివ్వడం లేదు.

తెలుగుదేశం నాయకులు, కార్యకర్తలు ఈ విచిత్రాన్ని చూసి బాధ పడిపోతున్నారు. ప్రజలలో చంద్రబాబు పట్ల, తెలుగుదేశం పార్టీ పట్ల ఎందువల్ల విశ్వాసం కలగడం లేదో వారికి బోధపడడం లేదు. అధికారపక్షం వైఫల్యాలు తమ రాజకీయ లాభంగా ఎందుకు మారడం లేదో అర్థం కావడం లేదు.

రాష్ట్రంలో జరుగుతున్న ప్రాంతీయ ఉద్యమాల పట్ల నిర్దుష్టమైన అభిప్రాయం లేకుండా వూగిసలాట ధోరణి అవలంభించడం; రోశయ్య ప్రభుత్వాన్ని ప్రజల ముందు నిలబెట్టడంలో తటపటాయింపు వైఖరి అవలంభించడం చంద్రబాబు చేస్తున్న తప్పులని తెలుగుదేశం నేతల అభిప్రాయం. అటు తెలంగాణ, ఇటు సమైక్యాంధ్ర ఉద్యమాలు

కొరవ 14వ పేజీలో



**జమీన్‌రైతు జీవప్రదాత స్వర్గీయ నెల్లూరు శ్రీరామమూర్తి మనుమరాలు నెల్లూరు కోసలరాం కుమార్తె ప్రియాంక, చెన్నైవాసి శశిధరన్ కుమారుడు ప్రమోద్‌ల వివాహం ఏప్రెల్ 1తేది తిరుమలలో జరిగింది.**



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.